# పల్లెజీవి

( సాంఘిక నాటకము )



రచయిత:

బి. యస్. సూరి

పబ్లిషర్స్:

క్వాలిటీ బుక్ షాపు,
గుడివాడ.



మే

1954

మూల్యం:

1-4-0

## నా మాట

ఈ నాటకం వ్రాయటానికి చేయూతనిచ్చిన బి. నాగభూషణరెడ్డి గారికి, ముద్రించటానికి సహాయపడిన శ్రీ కె. రామారావు గారికి నా అభినందనాలు

ఈ నాటకము యొక్క కాపీరైటు హక్కులు మినహా మిగతా హక్కులన్నీ నాకు చెందియున్నవి కాపీరైటు హక్కులు మాత్రం శ్రీ కొమ్మిరెడ్డి రామారావుగారికి చెందియున్నవి.

'జానకిరాం' పాత్రపోషణకు మొదటి రంగంవరకూ 12 ఏళ్ళ కుర్రవాణ్ణి, తరువాత షుమారు 20 ఏళ్ళవానిని నటింపజేసిన నాటకం బాగా రక్తికడుతుంది.

నమస్తే !
భవదీయుడు,
బి. యన్. సూరి



# సమర్పణ







నా జీవిత రథాన్ని ఆవరిస్తూన్న సుడిగాలులను ఛేదిస్తూ సారథిగావుండి సాగిస్తూ వున్న నా సోదరుడు గోపాలకృష్ణయ్య సూరికే

ప్రేమతో
బి. యస్. సూరి.



ఈ నాటకం 1—2—1954 వ తేదీన కృష్ణాజిల్లా "వేంపాడు" గ్రామములో యువజన నాట్యమండలి వారు ప్రదర్శించారు.

★ నాటి నటవర్గం ★

గోపయ్య : కె. కోటిరెడ్డి

జానకిరాం : 1. బి. రామారావు, 2. బి. యస్. రెడ్డి.

సతీష్ : ముక్కామల

జగదీశ్ శేట్ : దేవానంద్

సప్లయర్ : ఎ. వి. రెడ్డి

సబ్ ఇన్స్పెక్టర్ : మస్తాన్ రావు

సీత : శ్రీమతి సీతాకుమారి

మోహిని : ,, వసంతకుమారి

★ దర్శకత్వం ★

బి. యస్. సూరి.

మ్యూజిక్ : పి. రాము

ఆర్కెష్ట్రా : నవకళావని (బందరు)

—: నే ప ద్య గీ తం :—

సీతాకుమారి, సూరి, రాము.

నిర్మాత : బి. నాగభూషణరెడ్డి.

## ★ హెచ్చరిక ★

నా లిఖితపూర్వకమైన అనుమతి పత్రం లేనిదే యీ నాటకాన్ని ప్రదర్శించటంగాని, రికార్డింగు చేయుటం గాని, రేడియో బ్రాడ్‌కాస్టు చేయటంగాని, సినిమా తీయటంగాని, పాటలు విడిగా వుపయోగించటంగాని, మాటలు, పాటలు, సీనులు మార్చటంగాని చేయరాదు. ఇందుకు వ్యతిరేకించి ప్రవర్తించు నటీనటులు, నిర్వాహకులు, మ్యూజిక్ స్టాఫ్‌వారు, ఆర్గనైజర్స్, ఇంకా సంబంధించిన తదితరులు నాచే జరుపబడు సివిల్ క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురని ఇందుమూలముగా తెలియజేస్తున్నాను.

ఇట్లు,
బి. యన్. సూరి.
సూరీభవన్
సత్యనారాయణపురం విజయవాడ-2.



ప్రతులు 1000

: ముద్రణ :
జ్యోతీ ప్రెస్, గుడివాడ.

వెలువడ బోతూ oది ! వెలువడుతూoది !! వెలువడింది !!!

# "నాటకలోకం"

(హాస్య నాటిక)

మూల్యం : 0…8—0 మాత్రమే.

రచయిత :

## బి. యన్. సూరి.

నేటి నాటక రంగంలో జరిగే స్థితి అవినీతిని తెల్సుకుని క్షీణిస్తూన్న నాటక రంగాన్ని వృద్ధిలోకి తేవాలంటే ప్రతి నటుడూ, ప్రతి నటీ, ప్రతి ప్రేక్షకుడూ ఈ నాటిక చదవాలి. లేదా చూడాలి.

* భీష్మించుకు కూర్చున్న భీష్మాచార్యులనుకూడా కవ్వించి నవ్వించే నాటిక !

* పౌరాణిక నటుల పాలిట పెనుభూతం !

* అవినీతికి పాల్పడే ఆడవాళ్ల పాలిట ఆటంబాంబు

* స్వంత డబ్బాగాళ్ళ పాలిట శనిగ్రహం !

ఆలశించిన ఆశాభంగం ! త్వరపడుడు !

—— ♦ వివరములకు ♦ ——

## క్వాలిటీ బుక్ షాప్,

గుడివాడ.

15 వాయిద్యములతో ! విలువైన సెట్టింగ్సుతో ! కనులు మిరుమిట్లుగొలుపు లైటింగ్సుతో !

త్వ ర లో !

# ఆంధ్రదేశమంతటా

"రాజ్యం థియేటర్స్" వారి

# పతిసేవ

—: పాత్రధారులు :—

గోపయ్య : గోపాలకృష్ణ

జానకిరాం : బి. యన్. సూరి

సతీష్ : ఎ. పి. ఆర్.

జగదీశ్ : కొంగరాపి అప్పారావు

సప్లయర్ : బి. వీరవెంకయ్య

యస్. ఐ. : మాష్టర్ రాధ

సీత : శ్రీమతి కుమారి

మోహిని : ,, సీతాకుమారి

మ్యూజిక్ : నవకళావని (బందరు)

లైటింగ్ : మోడరన్ మైక్ & లైటింగ్ (విజయవాడ)

—: పాత్ర పరిచయం :—

## గోపయ్య

మధ్యరకం రైతు. వయస్సు షుమారు 35 సం॥లు

## జానకిరాం

గోపయ్య తమ్ముడు. వయస్సు షుమారు 20 సం॥లు

## సతీష్

మోహిని అనుచరుడు బోళామనిషి. వయస్సు షు॥ 20 సం॥లు

## జగదీశ్ శేట్

అరవవ్యక్తి. పెట్టుబడి దారుడు వయస్సు షుమారు 40 సం॥లు

## సప్లయర్

హోటల్ సప్లయర్. చదువుకున్నవాడు వయస్సు షు॥ 18 సం॥

## సబ్ ఇన్‌స్పెక్టర్

గవర్నమెంటు అధికారి. వయస్సు షుమారు 25 సం॥లు

## సీత

గోపయ్య భార్య. వయస్సు షుమారు 25 సం॥లు

## మోహిని

నర్తకి. పతిత. వయస్సు షుమారు 22 సం॥లు.

# పల్లెజీవి

## 1 వ రంగము

(తెరలో బుర్రకధ)

వినరా భారతకళాకారా
విజయము మనదేరా తందానా
తందానా దేవనందనాన ॥ వి ॥
భళాభళానోయ్ తమ్ముడా   సై
భాయిభళానోయ్ దాదాన
కళాకార్ల కేంద్రమురా   ,,
కళోద్ధారకులే మేమురా   ,,
వీరులగన్నా భూమిరా   ,,
వీరపుత్రులను గాంచినా   ,,
వీరనారీమణు లెలసినా   ,,
సిరిసంపదలా తులతూగేటి
పాడిపంటలా నిలయంరా తందానా
తందానా దేవనందనాన ॥

ఆలా సిరిసంపదలతో తులతూగే రత్నగర్భలాంటి దీ పట్టణం! కండలు కరిగేలా శ్రమించే కార్మికులతో, ఎముకలు పిండయ్యేలా పండించే కర్షకులతో నిండి వున్నదీదేశం! శత్రు సైన్యానికికూడా వెరవక నెత్తురు చిల్చి చెండాడే వీరయోధుల గన్న దీ భరతఖండం! అలాంటి యీ భారత భూమిలో "సూర్యాపురం" అనే గ్రామంలో ఒకమధ్యరక కుటుంబీకుని గాధ యెలాగుందయ్యా అంటే... ...

[ గోపయ్య నాగలి భుజాన పెట్టుకుని వెళ్లుతూ వుండగా తెరలో పాట వినిపిస్తూ వుంటుంది. వీలైతే మరికొందరు రైతులను వెంట పంపవచ్చును ]

( తెరలో పాట )

లేవరా లేవరా లేవరా
రైతు సోదరా ఓ రైతుసోదరా ॥ లే ॥
తొలికోడి కూతలే
వినిపించె నదిగోరా
జగతినంత నడుపగా
జాగులేక వేగరా
లేచి నడుంకట్టరా
నాగలి చేబట్టరా ॥ లే ॥
దుక్కిదున్ని చేలలో

విత్తులన్ని చల్లగా
కోతకోసి వేగమే
కుప్పలేసి నూర్పగా
రాత్రినక పగలనక
పండించగా లేవోయ్
రైతుసోదరా లేచి
రావేలనోయీ రావేలనోయీ ॥ లే ॥

[ తెర లేచేసరికి సమయం షుమారు వుదయం 7 గంటలు. గోపయ్యయిల్లు, దండెంమీద కొన్నిగుడ్డలు వ్రేలాడుతూంటై. గోడకు లక్ష్మి సరస్వతుల ఫొటోలు తగిలించి వుంటై. పట్టిమంచం ఎత్తివుంటుంది ఒకప్రక్క కుర్చీ, మరోప్రక్క శ్రీకృష్ణుని విగ్రహం అలంకరించి దీపారాధనచేసి పువ్వులు అలంకరించి సీత పూజ చేస్తూంటుంది ]

( సీత పాట )

శ్రీ పరమేశా మురళీశా
మొరవినవా జగదీశా ॥ శ్రీ ॥
పరమేశా బ్రోవగరావా
మమ్ముగనవా గోపాలా ॥ శ్రీ ॥
శ్రీకృష్ణాయని భక్తితో కొల్చెడి
భక్తులపాలిట పావనమూర్తివై

అభయమునిచ్చి కావుముదేవా ॥ శ్రీ ॥
ఎల్లజగంబుల ఏలినవాడవు
వెంటనంటుచూ వేగమెరావా
దీనులమమ్మా కావుముదేవా ॥ శ్రీ ॥

[ పాట పూర్తవ్వగానే హారతియిచ్చి సీత లోనికి వెళ్తుంది. గోపయ్య సీరియస్‌గా బయటనుంచి వస్తాడు ]

గోప:- సీతా! సీతా!

సీత!- (లోనినుంచి) ఆ! (వచ్చి) ఏమిటండీ, వచ్చేశారేమిటి?

గోప:- రాకేంజేస్తాం! అసలు వీడున్నాడా?

సీత:- ఎవరూ?

గోప:- మీ ముద్దుల మరదిగారు.

సీత:- అదేమిటండీ అలాగంటారు?

గోప:- అంటంకాదు. కన్పించనియ్ చీలుస్తాను.

సీత:- ఏమిటండీ!.. ఏంజేశాడు?

గోప:- మనకున్న పరువు ప్రతిష్టలు కాస్తా నేలపాల్జేస్తున్నాడు.

సీత:- యింతకీ విషయం చెప్పకుండా... ...

గోప:- వెర్రివాడిలాగా వాగుతున్నానంటావుకదూ!

సీత:- ఎందుకండీ ... అంతకష్టం! చిన్నవాడు. ఏదో తెలియక తప్పుజేస్తే రుసరుసలాడితే ఏంలాభం? మందలించుకోవాలిగాని,

గోప:- అసలు నీగారాబమే యింతవరకూ తీసుకువచ్చింది. శాస్త్ర వృన్నాడో లేదో వాడికి సిగరెట్లు అలవాటేమిటి చెప్పు?

సీత:- సిగరెట్లా!

గోప:- అంతేకాదు, జూదంకూడాను.

సీత:- ఆఁ!

గోప:- అవును, ఇంతకుముందు ఇరవైమంది కుర్రాళ్ళతో కలసి జూదమాడుతూంటే పోలీసులు వచ్చారట. పదిమంది పరారైనారట. పదిమంది పట్టుబడ్డారట. అందులో మనదౌర్భాగ్యుడుకూడా వున్నాడట. కాని పరారైన వాళ్ళలోవున్నదీ పట్టుబడ్డవాళ్ళలో వున్నదీ అర్ధంకా లేదు. సహించినకొద్ది మరీ మితిమీరిపోతున్నాడు.

సీత:- అరే! ఎప్పుడు అలవాటైనాయ్! సరిగా బడివేళకు వెళ్ళి యింటికి వచ్చేస్తాడే?

గోప:- అందుకే నీకు బుద్ధిమంతుడులాగా కనిపిస్తున్నాడు. అసలు విషయం నీకేం తెలుస్తుంది. బడికని బయలుదేరు తాడు. ఆడి ఆడి వున్నవన్ని ఆర్పుకుని విసిగి వేసారి సాయంత్రానికి యింటికి వస్తాడు. తమరేదో చదివి వుద్ధరిస్తున్నాడని భావిస్తున్నారు. ఆ మహానీయుడు చేసే ఘనకార్యాలివి.

సీత:- లోగడ ఎప్పుడూ చెప్పలేదేం?

గోప:- చూస్తే చూడకుండా వూరుకుంటున్నాను. మరీయింత మితిమీరి పోతాడని నాకేం తెలుసు.

సీత:- మీరు ఇంట్లోకి వెళ్ళి స్నానం చెయ్యండి. రాగానే నేను మందలిస్తాలెండి.

గోప:- సంతోషించాం లెండి. అసలు నీమూలంగా కాదూ వాడిలా తయారయ్యింది? నువ్వే వాణ్ణి యిలా చేశావ్! నీమూలంగానే వాడు చెడిపోయాడు!

సీత:- (బాధతో) అనండి! ఎన్నన్నా నన్నేగా! మీతల్లిదండ్రులకిచ్చిన మాటప్రకారం కన్నకుమారుని కంటే గారాబంగా చూసుకుంటున్నాను. అంతేకాని అతనిని నాశనం చేస్తే నాకేంలాభం? అతను పాడైనందువల్ల నాకువచ్చే కీర్తేముంది?

గోప:- (ఆవేశంతో) శీతా! (బాధగా) లేదుశీతా! వాడు చెడిపోతున్నాడన్న ఆవేశంతో నిన్నుఅనరానిమాటలు అన్నాను. కాని నువ్వు వాణ్ణేవిధంగా చూసుకుంటుందీ నాకు తెలీయదూ! "మొక్కై వొంగంది మ్రానై వొంగుతుందా! అందుకే యిప్పటినుంచీ జాగ్రత్త తీసుకోవటం మంచిదని ఆవేశపడ్డాను.

సీత:- ముందు మీరు లోనికివెళ్ళి స్నానం చెయ్యండి. (దండెం మీద తుండుగుడ్డ తీసియిస్తుంది. గోపయ్య తీసుకొని లోనికి వెళ్తాడు. జానకిరాం పరాకుగా సిగరెట్టు కాలుస్తూ యింట్లో ప్రవేశిస్తాడు)

సీత:- (అతన్నిచూసి ఆశ్చర్యపోతూ) జానకిరాం !

జాన:- ఆఁ ... ఆఁ ... ఏమీలేదు. (అంటూ సిగరెట్టు ప్రక్కన పారేస్తాడు)

సీత:- ఏమిటి నాయనా అది? నువ్వు చెయ్యాల్సినపనేనా అది? చిన్నవాడికి యిలాంటి దురభ్యాసాలేమిటి చెప్పు?

జాన:- అబ్బే! అలవాటుకాదు వొదినా! ఎవరో స్నేహితుడు బలవంతాన యిస్తే వూరికే వెలిగించాను. అంతే!

సీత : అంతేకదూ! నా దగ్గరే అబద్ధమాడుతున్నావ్! నిజం చెప్పు నీకలవాటులేదూ! నామీద ఒట్టేసి చెప్పు!

జాన:- (తల వొంచుకుంటాడు)

సీత :- నువ్విలాంటి నీచమైనపనులు చేయటం నాకేమంత బాగుండలేదుబాబూ! నువ్విలాంటి దురలవాట్లను పాల్పడుతూవుంటే మీ అన్నయ్య ఎంత బాధపడతారో ఆలోచించుకో! ఇహనుంచి నువ్విలాంటి పనులు చేశావంటే నన్ను చంపుకు తిన్నంత వొట్టు!

జాన :- (బాధతో కూడిన ఆవేశంతో) ఒదినా!

సీత :- (విచారంగా) సరే! నీయిష్టం! (లోనికి వెళ్తుంది)

జాన :- (పారేసిన సిగరెట్టు తీసుకుని తాగుతూ) సిగరెట్టు తాగితే తప్పట! (కుర్చీలో కూర్చుని) అయినా నేనే మైనా అలవాటు చేసుకుంటే తప్పుకాని ఎవరో స్నేహితుడు యిస్తే వూరికే వెలిగిస్తే ఏంతప్పు? ఎందరు

మహానుభావులు, యెంతమంది దేశనాయకులు, యెంత మంది మహాకవులు యీ సిగరెట్టు సేవించటం లేదూ! "సిగరెట్టు తాగనివాడు దున్నపోతై పుట్టున్" అన్నాడు ఒక మహాకవి అలాంటి గొప్పగొప్పవాళ్ళు సేవించేది దురల్వాటు యెందుకవుతుంది ?

[గోపయ్య తల రేగి వుంటుంది. తడి తుండు భుజాన వేసుకుని వస్తాడు జానకిరాం గాబరాగా సిగరెట్టు నలిపి జేబులో వేసుకుంటాడు]

గోప:- ఏరా ! యెప్పుడొచ్చావ్ ?

జాన:- ఇందాకే వచ్చాను.

గోప:- యెక్కడికెళ్లావ్ ?

జాన :- స్కూలునుంచి పిల్లలంతాకలసి ఆడుకుంటానికి వెళ్లాం !

గోప:- ఏంఆట ? నిజంచెప్పు ?

జాన; (కరంటు షాక్ కొట్టినట్టుగా తలవంచుకుంటాడు.)

గోప:- మాట్లాడవేం ?

జాన :- (మాట్లాడడు)

గోప:- జేబులో ఏమున్నయో తీయ్ ?

జాన :- (తలవొంచుకుంటాడు)

గోప;- తియ్యరా వెధవా ! (చెంపమీద కొడ్తాడు.)

జాన :- (ఏడుస్తూ జేబులోంచి ఒక సిగరెట్టుపెట్టె, అగ్గిపెట్టె పేక ఒక యెంగిలిసిగరెట్టు బయటకు తీస్తాడు)

గోప:- యెక్కడివిరా ఇవ్వన్నీ ?

జాన:- మా స్నేహితుడివి.

గోప:- నీదగ్గ రెందుకుంచావ్ ?

జాన:- ఆటలో పడిపోతాయని నా దగ్గర దాచమని యిచ్చాడు.

గోప:- పాపం! యెంత కష్టపడ్డావ్! ఇంతకీ నువ్వూ కాలు స్తావా ? నువ్వూ ఆడతావా ?

జాన:- లేదు.

గోప:- లేదూ... !(ఆ వేశంతో రెండు చంపలమీద కొడ్తాడు)

జాన:- (దెబ్బలబాధ భరించలేక) నేనూ కాల్చాను.

గోప:- పేకాడావా ?

జాన:- ఆ !

గోప:- మరినిన్ను పోలీసులు పట్టుకెళ్ళలా ?

జాన:- లేదు.

గోప:- యెందుకని ?

జాన:- పారిపోయి వచ్చాను.

గోప:- ఇలాంటి వెధవపనులు చేయటం పొరపాటేనా ?

జాన:- పొరపాటే.

గోప:- చెంపలు వేసుకో !

జాన:- (చెంపలు వేసుకుంటాడు)

గోప:- యికనుంచి యిలాంటి తప్పుడుపనులు చెయ్యవుకదూ!

సీత:- (లోపలినుంచి వచ్చి) చెయ్యడులెండీ! (అంటూ లోనికి తీసుకు వెళ్ళబోతుంది)

గోప:- ఆగు! వాడిచేత చెప్పించాలి. నువ్వు లోపలకెళ్ళు. ఏరా మాట్లాడవేం?

జాన:- (తలవంచుకుని) చెయ్యను. (అంటూ లోనికి వెళతాడు సీతగూడా వెళ్ళబోతుంది)

గోప:- సీతా!

సీత :- (వెనక్కువచ్చి) ఏమండీ?

గోప:- (విచారంగా) సీతా! నాకుమాత్రం ప్రేమలేదనా? యెలాగైనా వాడిని వృద్ధిలోకి తేవాలనేగా నా వుద్దేశం.! అంతేగాని ఏనాడైనా వాణ్ణి కొట్టానా? యెప్పుడైనా తిట్టానా? చెప్పు సీతా! (కంటినుండి నీటి బిందువులు రాలినై)

సీత:- (ఆశ్చర్యపోతూ) అదేమిటండీ! పెద్దవారు మీరుకొడితే తప్పేముందీ? మంచిమార్గంలో పెట్టటానికేగా యీ ప్రయత్నమంతాను. పదండి, చాలాపొద్దెక్కింది. భోజనం చేద్దురుగాని.

(ఇద్దరూ లోనికి వెళ్తారు. జానకిరాం లోనినుంచి వచ్చి అయోమయంగా ఆలోచిస్తూంటాడు. తెరలో అన్న, వొదిన, ఆత్మమాటలు వినిపిస్తూంటై.)

గోప:- ఇకనుంచి యిలాంటి తప్పుడుపనులు చెయ్యవుకదూ!

సీత:- చెయ్యడులెండి !

గోప:- నువ్వూరుకో వాడితో చెప్పించాలి.

ఆత్మ:- (నవ్వి) కురత్రితనంలోనే ఇంత కట్టుదిట్టంలో వుంటే స్వేచ్ఛాజీవితం ఎప్పుడు చవిచూస్తావోయ్ !

జాన:- మరేంచెయ్యనూ ?

ఆత్మ:- స్వేచ్ఛ స్వతంత్రం లేని యీబ్రతుకుకంటే మరణమే మేలు !

జాన:- ఆఁ! మరణమా! అప్పుడేనా! నాకు స్వతంత్రంగా జీవించే మార్గమే లేదా ?

ఆత్మ:- వుంది.

జాన:- ఆఁ! ఏవిధంగా! ఎలా సాధ్యపడుతుంది ?

ఆత్మ:- చెప్పమంటావా ?

జాన:- చెప్పు.

ఆత్మ:- నువ్వు చెయ్యగలవా !

జాన:- ఆఁ! ముమ్మాటికీ చేస్తానని మాట యిస్తున్నాను.

ఆత్మ:- అయితే నువ్వు తక్షణం యిల్లువదలి ఏపట్టణమో, పారిపో! సుఖంగా జీవించవచ్చు! కష్టపడి సంపాయించుకోవచ్చు! స్వేచ్ఛగా కాలం గడపుకోవచ్చు! వెళ్ళు!

జాన:- వెళ్లటానికి డబ్బు ?

ఆత్మ:- ఋణమో ఫణమో యింట్లోనించి స్వీకరించటమే !

జాన:- మరి మా అన్నయ్యా వొదినా ?

ఆత్మ:- వాళ్లకేం ! యిక్కడేవుంటారు. నువ్వు వృద్ధిలోకివచ్చి తిరిగి వస్తే ఆనందంగా ఆహ్వానిస్తారు. వెళ్లు ! వెళ్లు !

జాన:- సరే ! వెళ్తాను !

[ లోనికివెళ్ళి కాగితం కలం తీసుకువచ్చి వుత్తరం వ్రాస్తుంటాడు తెరలో పాట వినిపిస్తూంటుంది. ]

( తెరలోపాట )

స్వేచ్ఛకై పోయేటి ఓచిన్నవాడా
వెనుతిరిగిరాకోయి ఓచిన్నవాడా ॥ స్వే ॥
జేబులో డబ్బులూ లేనిదే
జోగైన జోలికీరాడూ
ఆజోడు చేరితేను
తిరిగిల్లు చేరలేవోయ్ ॥ స్వే ॥
ఎంతో మంచిగచెప్పి
ఎంతోనమ్మికజూపి
వెంటాడి నిన్నూ
నీతి మరిపిస్తారోయ్ ॥ స్వే ॥

[ పాటయ్యేటప్పటికి జానకిరాం వుత్తరం పూర్తిచేసి బాధగా కుర్చీ మీద పడేసి వెళ్లిపోతాడు. తెరలోనుంచి సీత 'జానకిరాం' 'జానకిరాం'

అని కేక వేస్తూంది. సమాధానం రాకపోవటంచూచి బయటకువచ్చి గాబరాగా వెదుకుతూండగా వుత్తరం దొరుకుతుంది. గాబరాగా వుత్తరంతీసి చదువుతుంది. ]

అన్నయ్యా !

నమస్తే ! నిన్ను నేను చాలా బాధపెట్టాను. అందుకు నేనెంతో పరితపించాను. ఏమీ తోచలేదు. ఆఖరికి నేను ఒక్కటే నిర్ణయించుకుంది. స్వేచ్ఛలేకుండా యిక్కడేవుండి మిమ్మలను వేధించుకుతినేకంటే స్వతంత్రంగా ఎక్కడైనా జీవించటం మంచిదని బయలుదేరాను ! వృద్ధిలోకి వచ్చిన తరువాత కలుస్తాను. నాగురించి మీరు వెదకటం అనవసరం ! తల్లికంటే ఎంతో గారాబంగా చూసుకున్న వొదిన ఋణం యెలాతీర్చుకుంటానో ! నా నమస్కారాలని చెప్పు ! సాధ్యమైనంత త్వరలో కలుస్తాను.

నమస్తే !

మీ జానకిరాం

[ సీతకి వుత్తరం పూర్తయ్యేటప్పటికి కన్నీరు బొటబొటా కారుతూంటై. 'జానకిరాం' అని పెద్దగా కేకేసి కుర్చీమీద వాలిపోతుంది ]
గోప:— (గాబరాగావచ్చి) ఏమిటే ! ఏమిజరిగిందే ?

[ సీత వుత్తరం చేతికిస్తుంది. గోపయ్య ఆయోమయంగా చూస్తూంటాడు ].

( తెరలో పాట )

అయిపోయినదా ఆంధ్రయువకా
కష్టానికితగు ఫలితమిదేనా ॥ అ ॥
జీవితమంతా వ్యర్థమాయెనా
చేసినమేలూ యెదురు తిరిగెనా ॥ అ ॥
యీవాదే నాటికి అదృశ్యంబానో
యీతుఫాను ఏనాటికి వెలియునో
జీవితశాంతి నాడేనయ్యా
ఆత్మశాంతి ఆనాడేనయ్యా ॥ అ ॥

సీత:- (ఏడుస్తూ) ఏమండీ! వెళ్ళండి! యెక్కడున్నాడో వెదకండీ! నాజానకిరాంని నాకు చూపించండీ!

గోప:- (దీర్ఘంగా శ్వాసవిడచి) సీతా! వెళ్తాను! వాడు వెళ్లిపోవటం నాకు మాత్రం బాధకదూ! వూరువూరా వెతికిస్తాను! పేపర్లో ప్రకటిస్తాను! పట్టితెచ్చినవాళ్లకు బహుమతి యిస్తాను! యెక్కడున్నా, యెంతఖర్చయినా నీజానకిరాంని నీకు వప్పగిస్తాను. సరేనా?

సీత:- (ఆనందభాష్పాలు విడుస్తూ) సరే! ఆలాగే! వెళ్లండి! (గోపయ్య బయటకు వెళ్తాంటాడు, సీత అటేచూస్తూంటుంది.)

(తెర వాలును.)

# పల్లెజీవి

## 2వ రంగము

( తెరలో బుర్రకథ )

వినరా భారత కళాకారా
విజయము మనదేరా తందాన
తందానా దేవనందనాన ॥ వి ॥

అలా పారిపోయిన జానకిరాం కొరకు గోపయ్య వూరు వూరా వెదికించాడు, వీధివీధీ గాలించాడు, పత్రికలలో ప్రకటన లిచ్చాడు, యెప్పటికైనా తన తమ్ముడు తనకు లభించక పోతాడా అని స్వాతివానకు ముత్యపుచిప్పలా యెదురుచూస్తూ న్నాడు. ఇహ పారిపోయిన జానకిరాం స్థితి యెలాగుందయ్యా అంటే...... ...

వినరా భారత కళాకారా
విజయము మనదేరా తందాన
తందానా దేవనందనాన ॥ వి ॥
వున్నడబ్బుతో వూరూవూరా

జల్సాగ తిరిగాడూ ॥ తం ॥
సహపాటులంతా తనతోకలసీ
తిరుగాడారండీ ॥ తం ॥
పట్టణవాసం చేరేసరికీ
పైసా లేదండీ ॥ తం ॥

డబ్బు అయ్యేవరకూ డాబుసరిగా తిరిగాడు. బెల్లముండగానే చీమలు పడతాయ్ అన్నట్లు డబ్బు అయ్యేవరకూ స్నేహితులు ముచ్చటగా పొగిడారు. స్వేచ్ఛా జీవితమంటే సుఖంగానే ఉంటుందనుకున్నాడు పాపం ముక్కుపచ్చలారని పసివాడు. జేబులో చిల్లికానీ లేకుండా పట్టణం చేరాడు. స్నేహితులంతా డబ్బు అయ్యేవరకూ ఏవిధంగా పొగిడారో ఆ నోటితోనే దూషించారు. జానకిరాంకి ఏమీ అర్థంకాక వీధులవెంట తిరుగుతున్నాడు. తిండితిని రెండు రోజులయింది. కడుపు కాలిపోతున్నా కానీ సహాయంచేసే కరుణామయులే కన్పించ లేదు కళ్లుతిరిగి వొళ్ళు తూలిపోతూంది. అప్పుడు అతనిస్థితి ఎలావుందయ్యా అంటే ... ...

తందానో తందాన ఓయ్
దేవనందనానా ॥ తం ॥
అనురాలినా మోదురా సై
స్వేచ్ఛలేని పసిపాపడూ „
తిండి తిప్పలూ లేకనూ „

కళ్ళు తిరిగి కారుకిందనూ సై
వొళ్ళుతూలి పడినాడురా ,,
బాధకోర్వలేని బిడ్డడూ ,,
కడుపు మంటతో కన్నీరొదిలాడూ ॥ తం ॥

ఇలా తూలుతూ లేస్తూ పడుతూ పట్టణమంతా పచారుచేస్తున్నాడు. ఆఖరికి వొళ్ళుతూలి కళ్ళుతిరిగి ఒక కారుకింద పడ్డాడు. బలమైన గాయాలు తగిలినై. అది ఒక హోటల్ ప్రొప్రయిటర్ గారి కారు. వారు దయదల్చి జానకిరాంని తీసుకు వెళ్ళి బాగుచేయించి తనహోటల్లో సప్లయిర్ గా చేర్చుకున్నాడు. ఎంతో నమ్మకంతో రెండుసంవత్సరాలు కాలం గడిపాడు. ఆహోటల్ ప్రొప్రయిటర్ హోటల్ అమ్మి తనదేశం తరలిపోతూ జానకిరాంనిగూర్చి హోటల్ కొన్నవారికి ఎంతో మంచిగ చెప్పి వెళ్ళిపోయారు. యిట్లుండగా ఒకరోజున......

[తెరతీసేసరికి డోర్ కర్టెన్ కు "జ్యోతి రెస్టారెంటు" బోర్డింగ్ అండ్ లాడ్జింగ్ అని బోర్డు తగిలించి వుంటుంది. ఒకప్రక్క కుర్చీ, దానిముందు కాష్ టేబిల్, మరోప్రక్క నాలుగు కుర్చీలు అలంకరించి వుంటై. క్యాష్ టేబిల్ మీద రేడియో, కాలింగ్ బెల్లు, గడియారం వుంటై. జగదీశ్ సేట్ క్యాష్ లో కూర్చుని వుంటాడు. రేడియోలోనుంచి చక్కటి రికార్డువినిపిస్తూంటుంది.]

జగ:- (బెల్లు కొడతాడు)

జాన:- (వస్త్రాను కొద్ది నాజూకు తేలాడు. నూనూగు మీసాలు వచ్చినై.)

జగ:- నాకు యింకొక హోటల్‌నుంచి వైరుదా వచ్చినాది. నేను అర్జంటుగా అక్కడకుదా పోవాలి.

జాన:- ఏం చెయ్యమంటారు ?

జగ:- నీకుదా వేరే చెప్పేదేముందీ ... ... నీగురించి లోగడ ప్రొప్రయిటర్ దా చెప్పనే చెప్పినారు. నీకుదా తెలిసినంత మంచిచెడ్డలు వారికికూడా తెలీయను అనిదా చెప్పినారు.

జాన:- చిత్రం !

జగ:- నీపేరుదా ఏమిటీ?

జాన:- జానకిరాం అండీ !

జగ:- ఆఁ ! జానకిరాం ! యీహోటల్ మేనేజ్‌మెంటుదా నీమీద పెట్టదల్చాను. యామి సెప్తావ్ !

జాన:- మీదయ అండీ !

జగ:- నాకు యిలాంటి హోటల్సుదా అనేకమున్నై. ఒరు చోటదా కూర్చుంటానికి మాల్దు.

జాన:- ఓహో అలాగా !

జగ:- ఆమా ! నువ్వుదా జాగ్రత్తగా హోటల్ దా రన్ చేస్తూ డైలీ రిపోర్టుదా పంపుతుండాలి.

జాన:- చిత్రం ! మీదయవుంటే నాకంతేచాలు.

జగ:- స్టాఫ్‌నందర్నీ జాగ్రత్తగాదా అదుపులో పెట్టుకుని నడుపుకోవాలి. ఇదుగో నా అడ్రెసు (అంటూ కాగితం మీద వ్రాసియిస్తాడు) అమ ! నానుదా పోయివస్తునా!

జాన:- చిత్తం !

(జగదీశ్ శేట్ బయటకు జానకిరాం డోర్‌కర్టెన్ లోనికి వెళ్తారు)

(తెరలో పాట)

మారినదోయీ కాలం
మారినదోయీ ధర్మం ॥ మా ॥
మారుట దానికి సహజముకాదా
కష్టసుఖములిలలో కావడికుండలురా ॥ మా ॥
అదృష్టంబుకు ఐశ్వర్యంబుకు
పేదసాదలనీ వ్యత్యాసములే
ఇలలో కలలో లేనేలేవ్రా ॥ మా ॥

[పాటవ్వగానే రేడియోలో యింగ్లీషు ట్యూను వినిపిస్తూంటుంది. జానకిరాంలోనినుంచివచ్చి కాష్‌లో కూర్చుంటాడు. మనిషి మంచి నాజూకుగా వుంటాడు. కళ్ళజోడు, తెల్లనిబట్టలు, ఫ్రెంచి కటింగ్ మీసాలు, బయటనుంచి సతీష్ మోహిని వస్తాడు. వెనకాల పెట్టి బెడ్డింగ్, ఒక కుర్రవాడు తీసుకువస్తాడు.]

సతీ:- గుడ్‌మార్నింగ్ బ్రదర్ !

జాన:- గుడ్‌మార్నింగ్ !

సతీ:- రూమ్స్ ఏమన్నా ఖాళీవున్నయ్యా బ్రదర్ !

జాన:- ఆఁ! ఫ్రసైష్. సింగలా ! డబులా ?

సతీ:- సింగలా నాన్సెన్సు! అదేమిటి బ్రిదర్ నువ్వుకూడా అలా అడుగుతావ్ ! డబుల్‌రూమే కావాలి.

జాన:- సరే! అడ్వాన్సు ఒక టెన్ రుపీస్ యిప్పించండి !

సతీ:- అడ్వాన్సా ! అదేమిటిబ్రిదర్ ! నేను కలకటా, బాంబే, ఢిల్లీ, మదాస్ అన్నీ తిరిగినా ఎక్కడా అడ్వాన్సు అనే పదానికే తలొగ్గలేదు.

జాన:- కాని యిక్కడ తప్పదు.

సతీ:- సరే ! తీసుకో బ్రిదర్ ! (అంటూ యిస్తాడు)

జాన:- (తీసుకుని వ్రాసుకుంటూ )మీ పేరు ?

సతీ:- సతీష్ !

జాన:- వూరు ?

సతీ:- డప్పాలపురం.

జాన:- ( బెల్లు కొడతాడు లోనినుంచి సప్లయిర్ వస్తాడు ) వీరికి డబుల్‌రూం చూపించు.

(సప్లయిర్, సతీష్, మోహిని, కూలీవాడు లోనికి వెళ్తారు)

[ తెర లో ]

(గాజుగ్లాసు క్రిందబడి పగిలిన చప్పుడు)

వ్యక్తి:- ఏరా కళ్లు మూసుకుపోయాయా ?

సప్ల:- చూడలేదండీ !

వ్యక్తి:- చూడలేదంటావేరా వళ్ళు రాలగొట్టేవాళ్ళులేక.

సప్ల:- మర్యాదగా మాట్లాడండి.

వ్యక్తి:- మళ్ళీ ఆమాటన్నావంటే మొహం పగిలేటట్లు కొడ్తాను

సప్ల :- కొడితే మళ్ళీ కొడ్తారు.

జాన:- (కోపంగా లోనికిచూస్తూ బెల్లు కొడ్తూ) అరేయ్ !
యిటురా !

(సప్లయిర్ వస్తాడు)

ఏమిటిరా ప్యాసింజర్స్‌తో గలాటా !

సప్ల :- చూడలేదండీ చెయ్యితగిలి గ్లాసు క్రింద పడింది. ఆ
నీళ్ళు చింది వారిమీద పడినై. తప్పన్నా మరీ మాటలు
మిగుల్తున్నారు చూడండి.

జాన:- అందుకని కొడితే మళ్ళీ కొడతానంటావురా !

సప్ల:- అదేమిటండీ! కొడితే తింటానికటండీ యీ వుద్యోగం!
మాటలు మిగిల్తే ఎవరు సహిస్తారండీ !

జాన:- అందుకని వచ్చిన ప్యాసింజర్స్‌తో గులవుతుంటే
ఎవరొస్తారురా ! మాట్లాడవేం ?

సప్ల:- ఏం మాట్లాడమంటారు?

జాన:- యిలాంటి వెధవపనులు చెయ్యకని చెంపలేసుకో !

సప్ల:- యిందులో నాతప్పేమీ లేదండి.

జాన:- తప్పు లేదంటావేరా రాస్కెల్ ! (చెంపమీద
కొడతాడు)

సప్లః- (చెంప సవరించుకుంటూ) మంచిపని చేశారు. నేనూ మీ స్థితిలో ఉంటే కొట్టగలరా ? నేను పేదవాణ్ణి. మీరు ధనవంతులు. అందుకే చెయ్యిజారారు. యీ రోజు చేతిలో ధనమున్నంత మాత్రాన కళ్ళు పొరలు గప్పి ప్రవర్తించటం మంచిదికాదు. జరిగిపోయిన జీవిత గాథ వెనుతిరిగి ఒక్కసారి గుర్తు తెచ్చుకోండి. నేను మెట్రిక్యులేషన్ వరకూ చదివాను. వుద్యోగంకోసం వూరువూరా తిరిగాను. గతిలేక యిక్కడ సప్లయిరుగా చేరాను. మీరూ నేనూ కలిసి పనిచేసిన రోజులునైనా గుర్తు తెచ్చుకోండి.

జానః- నోర్మూయ్ !

సప్లః- వున్నమాటంటే వులుకెక్కువలేండి.

జానః- పిచ్చిపిచ్చిగా వాగక బయటకు నడువ్ !

సప్లః- హుం ! నడవటానికి సిద్ధపడే యిలా ప్రవర్తిస్తున్నాను. కాని ఒక్కటిమాత్రం గుర్తుంచుకోండి. తోటి సప్లయిర్ని అంత చులకనగా చూడటం మంచిదికాదు. వాళ్ళు చెమడోడ్చి కష్టపడి పనిచేస్తేనే మీరు కాలుమీద కాలేసుకుని సంపాయించుకునేది. మానాభిమానాలు మంటలో కలసిపోయిన మానవులేకాదు యీ వుద్యోగంకోసం చేరేది. గతిలేక నీతి నియమాలు పాటిస్తూ అంతరాత్మకు విరుద్ధంగా యీ కడుపుకోసం చేరతారు. అందుకే గౌరవం యిచ్చి గౌరవం తెచ్చుకోవటం ప్రతివారికీ ధర్మం.

జాన:- నీ ధర్మనిర్ణయాలు ఆపి దయవుంచి దయచెయ్ !

సప్త:- దయచేస్తాను. కాని ఆఖరి మాటగా ఒక్క ముక్క చెప్తున్నాను, ... ...

జాన:- వినాల్సినంత అవసరం నాకు లేదు.

సప్త:- కాని చెప్పాల్సినబాధ్యతమాత్రం నామీదుంది మాలో ఐక్యతలేనంతకాలం మీ ఆటలు ఇలాగే సాగుతై ! మాలో ఐకమత్యత ఏనాడైతే తలెత్తుతుందో ఆనాడే మీ ఆటలు కడ్తాయ్ ! మీ లోగడజీవితాన్ని గుర్తు తెచ్చుకుని ప్రవర్తించండి !

జాన:- గెటౌట్ రాస్కెల్ !

సప్త:- నమస్తే ! (బయటకు వెళ్తాడు అటునుంచే జగదీశ్ శేట్ వస్తాడు)

జాన:- (లేచి నిలబడి) రండి ! రండి ! కూర్చోండి !

జగ:- యేమియ్యా అలారా స్తిపి !

జాన:- ఏం చెయ్యమంటారు ? ప్రొక్క హోటల్స్ డాబుసరి చూస్తూంటే యిక్కడికి ఎవ్వరూ రావటంలేదు.

జగ:- రొంబ సిక్కుదా వచ్చి పడినాదే ! యిప్పో ఎన్నా మార్గం ?

జాన:- కాస్తోకూస్తో పెట్టుబడి భరిస్తే బ్రహ్మాండంగా నడపొచ్చు

జగ:- సరదా! మంచిగా దా చెప్తిపి! ఆ కాస్తోకూస్తో యిక్కడదా

తీసుకుపోదామని సూస్తూంటే నీ వుత్తరందా చేరింది. మాసేతలికీ నీరసందా అయ్యిపూడ్సింది.

జాన:- నా తప్పేమీ లేకుండా జాగ్రత్తగానే ఇంతవరకూ నడుపుకొస్తున్నాను.

జగ:- ఆను! అదిదా ఎనక్కు తెలియుం! నాకు బలే ఆలోచనదా తోస్తూండాది.

జాన:- ఏమిటది?

జగ:- యీహోటల్ నీపేరుదా వ్రాస్తునూ ... ... అంగులో కష్టనష్టాలు అంతాదా నీవే భరించవాలె. పెట్టుబడికి నోటుదా వ్రాయించి తెస్తినీ, (జేబులోంచి కాగితాలుతీసి చూపిస్తూ) యింగేపాఁరు! (అంటూయిస్తాడు)

జాన:- (తీసుకుని చదివి) సరే! మీదయ!

జగ:- అంగే సంతకందా పోడు.

[ జానకిరాం సంతకంపెట్టి యిస్తాడు. జగదీశ్ శేట్ జేబులోనుంచి నోటుగ కాగితాలు తీసి సంతకంచేసియిస్తాడు ]

జగ:- ఆను! నానుదా పోయివస్తునా?

జాన:- మంచిదండీ!

జగ:- ముష్టు సాధ్యమైనంత దొందరలోదా సర్దుతూవుండవాలె!

జాన: అలాగేనండీ!

జగ:- నానుదా పోయివస్తునా?

జాన:- మంచిది. నమస్తే!

[జగదీశ్ శేట్ బయటకు వెళ్తాడు. లోనినుంచి సతీష్ వస్తాడు]

సతీ:- నమస్తే!

జాన:- ఓఁ! మీరా! రండి. కూర్చోండి.

సతీ:- (కూర్చుంటాడు)

జాన:- ఏంపనిమీద వచ్చారండీ?

సతీ:- ఆఁ! ఏముంది బ్రిదర్! నా మిసెస్ డ్రమిటిక్ ఫీల్డులో మంచిఅనుభవం సంపాయించింది. యిక్కడ ఒకమిత్రుడు పిక్చర్‌లో ఛాన్సు యిప్పిస్తాను రమ్మని కబురుచేస్తే వచ్చాంబ్రిదర్!

జాన:- వెరీగ్లాడ్ (Very glad) ఆమె ఒక స్టేజ్ ఆర్టిస్టు (Stage Artist) అన్నమాట!

సతీ:- అదేమిటి బ్రిదర్! నాట్ ఓన్లీఎ స్టేజ్ ఆర్టిస్టు, బట్ ఆల్సో ఎ వెరీగుడ్ డాన్సర్! (Not only a stage artist but also a very good dancer)

జాన:- ఓఁ! ఐ సీ! (O, I see)

సతీ:- యు మస్టు సీ! (You must see) సాయంత్రం ఒక ప్రోగ్రాం అరేంజి చేయదల్చాం మనరూంలో. మీరు తప్పక దయచెయ్యాలి బ్రిదర్!

జాన:- ఓ యస్! అలాగే!

సతీ:- వెరీ గ్లాడ్! నస్తా బ్రదర్! (అంటూ షేక్‌హ్యాండు యిచ్చి) గుడ్ బై! (వెళ్తాడు)

(తెరపడుతుంది.)

# పల్లెజీవి

## 3వ రంగము

[ తెరతీచేసరికి 'రూం నెంబరు 5' అని బోర్డు తగిలించి వుంటుంది. ఒకసోఫా, రెండు కుర్చీలు ఒకటేబిల్ ఒకహార్మోనియం అలంకరించి వుంటై. మోహిని డ్యాన్సింగ్ డ్రస్సుతో సోఫామీద ఎదురుగా మాట్లాడుతూ సతీష్ కుర్చీమీద కూర్చునివుంటాడు.]

సతీ:- మోహినీ! ఏమైనాసరే వీణ్ణి వల్లో వేసుకున్నామా మనకు ఏడుతరాలుదాకా ఏలోటూవుండదు.

మోహి:- మహామహావాళ్ళే మనముందు లొంగిపోయారు. వీడొకలెఖ్ఖా ?

సతీ:- అబ్బే! అలాగంటేకాదు. ఎలాగైనా "మనప్రయత్నం చెమనం య్యాలి ఫలితం ఏమైనాసరే!"

మోహి:- అంటే ఏంలాభం! ఫలితం పొందితీరుతామని ఢంకా భజాయించి చెప్పు.

సతీ:- నా మోహినివల్లోపడ్డవాళ్ళు మనవశంకాకపోవటమనేది వుండనేవుండదని నాకు తెల్సుగా!

మోహి:- ఒక్క సినీఫీల్డులోనే దెబ్బతిన్నాం.

సతీ:- అని వూరుకుంటామా! వాళ్ళను ముప్పతిప్పలు పెట్టి మూడుచెరువుల నీళ్ళు త్రాగించమూ!

మోహి:- వద్దు బాబూ! నువ్వు ఎన్ని చెప్పినా వింటాను కాని ఆసినిమా ప్రపంచములోకి మాత్రం నేను రాను. (బాధగా) అబ్బా! ఎంతనీచం! మానాభిమానాలు వదులుకుని సంచరించినా మనని వుపయోగించుకునే వారేగాని మనకు వుపయోగపడేవారే లేరాయె!

సతీ:- అహాహా! కష్టాలు వచ్చినప్పుడే ఆదుకోవాలి. "ట్రై అండ్ ట్రై" అంటే "ప్రయత్నించూ మళ్లీ ప్రయత్నించు" అన్నాడు ఒక మహానుభావుడు.

మోహి:- ఆఁ ఎవరో అన్నారని మనమెక్కడ ప్రయత్నిస్తాములే!

సతీ:- "కష్టే ఫలే" అన్నారుగా పెద్దలు అంటే కష్టపడితేనే ఫలితం దక్కుతుందంటారు.

మోహి:- కబుర్లు చెప్పటానికీ ఆచరించటానికీ చాలా తేడావుంది. (విచారంగా) ఆనాడు డైరెక్టర్ దగ్గరనుంచి ఆఫీస్ బోయ్‌దాకా నన్నెంత నీచంగా చూశారనుకున్నావ్!

సతీ:- ఆఁ! (ఆవేశంతో) లోగడ చెప్పవేదేం! లేకపోతే ఆ వెధవల్ని చీల్చి చెండాడి ముక్కముక్కగా నరికి కాకులకు గద్దలకు వేసి అఖండవిజయం చేబూనేవాణ్ణి.

మోహి:- (హేళనగా) నీ సొరకాయకోతల కేమిలే!

సతీ:- (నీరసంగా) సరేలే! (టైంజూచి) ఆఁ మనవాడు వచ్చే టైంఅయ్యింది. ఆఁ అమృతమేదీ?

మోహి:- అమృతమేమిటీ?

సతీ:- అంటే అర్థంకాలా! మన గవర్నమెంటువారికి విషం లాగా కన్పించివుంటుంది. అందుకే నిషేధించబోతు న్నారు. మనలాటివాళ్లకు అమృతంలాగా కన్పిస్తుంది. కాబట్టే సేవిస్తున్నాం. (మోహిని లోనికెళ్ళి సీసా, గ్లాసూ తీసుకువచ్చి పోసి యిస్తుంది.)

సతీ:- (తాగి) అసలీ అమృతాన్ని నిషేధించటం పొరపాటం టాను.

మోహి:- ఎందుకని? (గ్లాసులో మళ్లీ పోసి యివ్వబోతుంది.)

సతీ:- ముందు నువ్వు కానియ్!

మోహి:- (తాగి) తినగా తినగా గారెలు చేదౌతాయంటారు కాని యిది తాగగా తాగగా రుచెక్కువౌతూందే!

సతీ:- అదే యిందులోవున్న గొప్పతనం. అందుకే దేవతలు అమృతాన్ని సేవిస్తుంటే భూలోకదేవతలం మనం యిది సేవిస్తున్నాం.

మోహి:- అలాంటియీపానీయాన్ని ఎందుకు నిషేదిస్తున్నారో?

సతీ:- నిషేధించినందువల్ల గవర్నమెంటుకు కొన్ని కోట్లు నష్టం. కాని ఆపగల్గారా... ..... ? లేదు. అట్లాంటప్పుడు యీ నిషేధంతీసివేసినంత వుత్తమం మరొకటి లేదు. (తలుపు చప్పుడౌతుంది) మన బ్రదర్ వచ్చాడల్లేవుంది వెళ్లి ఆహ్వానించు.

మోహి:- (వెళ్లి తలుపుతీసి) రండి రండి అలా దయచేయండి (అంటూ చూపిస్తుంది)

జాన:- (వెళ్ళి కూర్చుంటాడు)

సతీ:- యింతాలస్యమైందేం బ్రిదర్ ?

మోహి:- త్వరగావస్తే సంపాదనపోదూ !

జాన:- అబ్బే ! అదికాదు. కాష్ దగ్గర ఎవ్వరూ లేరు అందుకే ఆలశ్యమైంది.

సతీ:- మోహినీ ప్రారంభించు ! (అంటూ హార్మోనియం వాయిస్తూంటాడు. మోహిని డాన్సుచేస్తూ పాట పాడుతుంది)

( మో హి ని పా ట )

ప్రేమదీర ఒకసారి రావేల రాజా
హృదిలోని వలపంత వొలగీ పోతుందోయి
ఈజాగు ఏలనోయి మనసార కోరితీనోయ్ ॥ ప్రే ॥

సతీ:- (బ్రాందీ గ్లాసులో పోసి) తీసుకో బ్రిదర్ !

జాన:- అబ్బే అలవాటు లేదండీ !

సతీ:- అంటే ఎట్లాబ్రిదర్ అలవాటుచేసుకోవాలి.

జాన:- నాకు సహించదండీ !

సతీ:- మోహినీ నేనిస్తూంటే మొహమాట పడుతున్నాడు. నువ్వే యివ్వు.

[మోహిని గ్లాసు అందిస్తూ పాటపాడుతూంటుంది. జానకిరాం తప్పదన్నట్లుగా తీసుకుని తాగుతాడు.]

( పాట )

ఆనందముతో ఆరగించవోయీ
సమయము మించిన మరలరాదోయీ ॥ పే ॥

[సబ్ యిన్స్పెక్టర్ వచ్చి చూస్తూ ఆనందిస్తూంటాడు]

సతీః- రండి బ్రదర్ రండి! (అంటూ బ్రాందీసీసా గ్లాసూలోనికి తీసుకు వెళ్తాడు.)

( పా ట )

అధికారులారా చూడరండయ్యా
ఆసీనులయ్యి ఆనందించుడీ ॥ పే ॥

[సబ్ యిన్స్పెక్టర్ వచ్చి కూర్చుంటాడు. గ్లాసుతో డ్రింకు తెచ్చి యిచ్చి కూర్చుంటాడు. అందుకుని అనుమానిస్తూంటాడు.]

(పాట)

జీవితమంతా నాటకరంగమోయీ
ఆశ్చర్యపడక ఆరగించరయ్యా ॥ ప్రే ॥

సబ్ :- (తాగి) వెరీ గుడ్ ! చాలాబాగుంది! ఇన్విటేషన్ అయినా పంపలేదే! నెవ్వర్ మైండ్! అయినా ఫర వాలేదు. భోజనానికి వచ్చాను. గానాభజానా వినిపిస్తూంటే ఏమిటా... అని వచ్చాను. అచ్ఛా! వెళ్లొస్తాను.

సతీ:- మంచిది బ్రదర్ !

(సబ్‌యిన్స్పెక్టర్ వెళ్లిపోతాడు.)

సతీ:- (లేచి) నేను కాఫీతాగివస్తాను బ్రదర్ !

జాన:- నేనూ వస్తానండీ! (అంటూ లేస్తాడు.)

సతీ:- అబ్బే! నేను మీాయిద్దరికీ పంపిస్తానుగా బ్రదర్ !

(వెళ్తాడు.)

మోహి:- (చెయ్యిపట్టుకుని) కూర్చోండీ! (అంటూ కూర్చో పెడుతుంది. మూడుక్షణాలు నిశ్శబ్దం) ఏమండీ!

జాన:- (భయంగా) ఏమిటీ!

మోహి:- మిమ్మల్ని ఒక్కవిషయం అడగాలని వుంది. జవాబు చెప్తారా?

జాన :- ఆ!

మోహి:- మీాకు... ...

జాన:- ఆ... నాకు... ...

మోహి:- వివాహమైందా ?

జాన:- (అనుమానంగా) లేదు.

మోహి:- ఆఁ నేననుకున్నట్లే అయింది. అయితే ... ...

జాన:- ఏమిటీ!

మోహి:- చెప్పనా ?

జాన:- చెప్పు.

మోహి:- (రెండుచేతులూ పట్టుకుని) నేనుమిమ్మల్ని ......

జాన:- ఆ నన్ను ......

మోహి:- మనస్ఫూర్తిగా......

జాన:- ఆఁ

మోహి:- ప్రేమిస్తున్నాను.

జాన:- (భయంగా) ఏమిటీ ?

మోహి:- అవును. మిమ్మల్ని క్యాంప్‌దగ్గర ఏనాడైతే చూశానో ఆనాడే మీావశమయ్యాను. నాహృదయ సామ్రాజ్యానికి అధిపతిగా నియమించుకున్నాను. మీారు లేని నాజీవితం వృథా. మీారిష్టపడితే సుఖించటం ... లేదా......మరణించటం. యీరెండే మార్గాలు. ఏమంటారు ?

జాన:- (సందేహిస్తూ) పరాయివాని భార్య......

మోహి:- పైకిమాత్రమే ! యిప్పుడుమీాభార్యను.

జాన:- అతనుచూస్తే ?

మోహి:- ఏమీాఅనరు. నాయిష్టమే వారిష్టం. రండీ ! రండీ (అంటూ చెయ్యిపుచ్చుకుని లాక్కుంటూ వెళ్తుంది.! విధిలేక జానకిరాం భయం భయంగా చూస్తూ వెళ్తాడు)

సతీ:- (బయటనుంచి సిగరెట్టు కాలుస్తూవచ్చి వాళ్ళ ప్రణయ ఘట్టం చూస్తూ) బ్రదర్ ! యీారోజుతో నాపంట పండిందోయ్ ! ఎందుకంటావేమో ! ఒక మహాకవి

చెప్పాడూ "టూ బర్డ్సు ఎట్ ఒన్ షాట్" (Two birds at one shot) అంటే......ఒక్క దెబ్బకు రెండు పక్షులన్న మాట. యిటు నువ్వు పరిణయసామ్రాజ్యానికి అధిపతిగావుండి ఆరిపోతూవుండు. అటు నీహోటల్ వ్యవహారాలన్నీ చూస్తూ అమాంతం ఆరగించేస్తాను. వస్తాను బ్రదర్! గుడ్ బై! (బయటకు వెళ్తూంటాడు)

(తెర పడును)


**If you want to see best social dramas or one-act plays please**

CONTRACT WITH



**RAJYAM THEATRES**

| Head Office: | Founder | Branch : |
|---|---|---|
| **SURI BHAVAN** | & | **Puvvula Anasuya** |
| Satyanarayana Puram, | Director | Buildings |
| VIJAYAWADA - 2 | **B. N. Suri** | GUDIVADA. |

# పల్లెజీవి

## 4వ రంగము

( తెరలో బుర్రకథ )

వినరా భారత కళాకారా
విజయముమనదేరా తందాన
తందానా దేవనందనాన ॥ వి ॥
జానకిరామూ మధు సీవాకూ
దాసోహంమయ్యాడూ ॥ తం ॥
మధుపానానికి స్వేచ్ఛాజీవి
మారిపోయాడండీ ॥ తం ॥
వేశ్యజీవి వలలోచిక్కి
వడలిపోయాడండీ ॥ తం ॥
భళాభళానోయ్ తమ్ముడూ సై
భాయిభళానోయ్ దాదాన
రోజులు మారినవిరా ,,
నెలలు దొర్లిపోయినవిరా ,,
సంవత్సరాలూ గడచాయిరా ॥ తం ॥

ఈవిధంగా స్వేచ్ఛా జీవి వ్యభిచారి వల్లోచిక్కి మధుపాన మహాత్యంతో క్షీణించిపోయాడు. రోజులు, నెలలు, సంవత్సరాలూ గడిచినాయి. కాని అతని హృదయంలో మార్పు రాలేదు. సన్మార్గులకు దురభ్యాసాలు అలవడటం చాలాకష్టం! అలవాటైన తరువాత మర్చిపోవటం మరీకష్టం! యీవిధంగా అరమరలెరుగని ఆఅమాయకుడు, వేశ్యాజీవి వలలో వారిగిపోయి, మధుపాన మహాత్యానికి దాసోహామంటూ, హోటల్ విషయంకూడా మైమరచి ప్రవర్తిస్తున్నాడు. రాబడి తక్కువైంది! అప్పులబాధలు ఎక్కువైనై! ఇలాంటి స్థితిలో ఒక రోజున... ...

[ తెర లేచేసరికి అంతా రెండవరంగంమాదిరే అలంకరించివుంటుంది. జానకిరాం ఒకకుర్చీలో కూర్చుని బ్రాందీబుడ్డితో తాగుతూంటాడు. పైజమా, లాల్చీ, గడ్డం కొద్దిగా మాసినై. గదంతా నిర్జీవంగా కన్పిస్తూంది. రేడియోలో పాట వినిపిస్తూవుంటుంది.]

( రేడియోలో సాకీ )

చెదిరిన సంసారాలలో
చివురించిన స్వేచ్ఛాజీవం
మధుపాన మహాత్యానికి
విరిగిన మనసై బలిగానుంది!

తెరలో పాలవాడు:- బాబుగారూ! డబ్బులిప్పించుండీ!

జాన:- (నిషాతో) ఏండబ్బులురా!

తె. పా:- అదేటిబాబూ! క్రిందటివారం పాలడబ్బులుండే!

జాన:- అప్పుడేనా! ఒక వారంపోయినతరువాత రారా!

తె. పా:- బాబుగోరూ! మీరల్లాగంటే ఎలా జరుగుతుంది బాబూ!

జాన:- అరేయ్! అనవసరంగా అరవక తరువాతరా!

తె. పా:- అవసరం గడ్సింతరువాత అనవసరమే అంటారు లెగుండీ! కేవు తప్పక యియ్యాలండీ! లేకుంటే బాగుండదు (వెళ్తాడు)

జాన:- ఎడ్చావ్! పోరా! (నవ్వి గ్లాసులో బ్రాందీపోసుకుని త్రాగుతూంటాడు.)

తెరలో మాంసంవాడు:- క్యాజీ! గోస్థుకా పైసా దేవ్‌జీ!

జాన:- యిప్పుడేంలేదు తరువాత రావోయ్!

తె. మా:- వోయ్‌గీయ్ క్యాజీ! వాడేటప్పూ లేదూహాండీ?

జాన:- తరువాతయిస్తాను రా!

తె. మా:- సుబోకు పైసా దేనా! నైతో... (వెళ్తాడు)

జాన:- (తనలో నవ్వుకుంటూ త్రాగుతూంటాడు.)

సతీ:- (బయటనుంచివచ్చి) ఏం బ్రదర్! అలావున్నావేం?

జాన:- ఎలావున్నాను! బాగాలేనా! పోనీయ్‌లే, నువ్వు లా చేయొద్దులే! నామోయినిని యిలారమ్మను ఒకసారి.

సతీ:- (వెళ్తూ) అలాగే బ్రదర్! మనముంది అందుకేగా! (ఆగి)

సరేగాని బ్రదర్ యిటు పాలవాళ్లు అటు మాంసంవాడు నానామాటలూ అనుకుంటూ పోతున్నారేమిటీ ?

జాన:- వాళ్ళువాస్తే పెళ్లిపదాలన్నట్లు వీళ్లకేదో చేసేదాకా వూరుకోరు.

సతీ:- అంతే బ్రదర్ ! మర్యాదిచ్చి మర్యాద తెచ్చుకోవటం తెలిసేడవదు.

జాన:- సప్లయర్‌ని పిలువ్ !

సతీ:- రెండురోజుల్నుంచీ రావటంలేదుగా బ్రిదర్ !

జాన:- ఎందుకని ?

సతీ:- ఎందుకేమిటి బ్రిదర్ ! (గంభీరంగా) కోపమొస్తే మందలించుకోవాలిగాని అంతబాగా కొట్టుకుంటూరా ? పిచ్చిపిచ్చిగా చెయ్యిచేసుకుంటే ఎవరుసహిస్తారూ !

జాన:- [కోపంగా] ఏమిటీ !

సతీ:- (భయంగా) అబ్బే ఏమీలేదు బ్రిదర్ ! మీారలా చెయ్యిజేసుకున్నందుకు వాళ్లంతా కలసి సమ్మెజేస్తున్నారు బ్రదర్ !

జాన:- ఏడ్చారు ! అయితే నువ్వొక సహాయం చేసిపెట్టాలే !

సతీ:- (తెల్లమొహంవేసి) ఏమిటీ! కొంపతీసి నేనే సప్లయరుగా చేరాలా !

జాన:- ఛీ ! ఛీ ! నీ డిగ్నిటీకి లోపంకదూ !

సతీ:- ఆయితే చెప్పు బ్రదర్ ! క్షణంలో చేసి అవతలపారేస్తాను

జాన:- మ రేమీలేదు! మనరోజులు మరీ బాగుండలేదు. ఈబాకీలవాళ్లందరికీ సర్దుబాటు చెయ్యాలంటే యీ హోటల్ అంతా అమ్మినా చాలదు.

సతీ:- నాకు తెలియదూ బ్రదర్! పై డాబుసరుంటే చాలు. డబ్బు ఎంతైనా గుప్పేస్తారు. అందుకేగదూ నీకంత మంది అప్పులుపెట్టారు. మంచినీతి నేర్చావ్!

జాన:- ఎవరు?

సతీ:- నువ్వే బ్రదర్!

జాన:- ఏమని?

సతీ:- ఏమనేమిటి బ్రిదర్! పైడాబులుచూసి మోసపోవద్దని చక్కటినీతి నేర్చావ్!

జాన:- (నవ్వి) లేకపోతే నేనడిగిందే చాలని వేలకువేలు గుప్పారు.

సతీ:- వాళ్లకు తగినశాస్తి జరిగిందిగా బ్రదర్!

జాన:- అసలువిషయంలోకి వద్దాం! ఇదంతా అమ్మినా అప్పుల బాధ తీరేటట్లు లేదు. అందుకే యీహోటల్ మరొకరి పేరున పెట్టి నిదానంగా తప్పుకోవటం మంచిదని ఆలోచిస్తున్నాను.

సతీ:- యింతకీ ఎవరిపేరున పెట్టదల్చావ్ బ్రదర్!

జాన:- నీపేరనే పెడదామనుకుంటున్నాను......

సతీ:- (సంతోషంతో) బ్రదర్! నువ్వింత బ్రతిమాల్తుంటే కాదంటానా?

జాన:- కాని... ...

సతీ:- ఇంకా కానీ అర్థణాలతో పనేమిటి బ్రదర్ !

జాన:- నిజమే అంతచిన్న ఎమౌంట్సుతో పనిజరిగేటట్లు లేదు. షుమారుగు యిరవై వేల పెట్టుబడి పెడ్తేనేకాని ప్రక్క హోటల్సుని పడగొట్టేటంత డాబుసరిగా నడపలేం.

సతీ:- (నీరసగా) అందుకని ?

జాన:- ఆమాత్రం పెట్టుబడి భరించినవారి పేరున వ్రాసి నేనొక భాగస్థుడిగా వుందామని నావుద్దేశము.

సతీ:- ఆపెట్టుబడేదో నేనేచూస్తాను. యింతమాత్రాన ఇంకొకరిపేరున వ్రాయటం ఎందుకూ !

జాన:- నీపేరునయితే నాకూ యిష్టమే ! కాని ఎక్కణ్ణుంచి తెస్తావ్ ?

సతీ:- మన మోహిని మెళ్లో కాసులపేరుందిగా... ...

జాన:- ఆఁ నేను చేయించిందా ?

సతీ:- ఎవరుచేయిస్తేనే ఏం బ్రదర్ ! అవసరార్థం వుపయోగపడతానికేగా యీవస్తువులు. మళ్లీ తొందరలోనే చేయించుకోవచ్చు.

జాన:- అదీ నిజమేలే ! అయితే అతిత్వరలో అమోఘంగా ఆరంభించటం మంచిది.

సతీ:- అలాగే !

జాన:- కాగితాలవీ యెప్పుడువ్రాసుకుందాం ?

సతీ:- ఆఁ యింతమాత్రానికి కాగితాలెందుకులే బ్రదర్ !

జాన:- రామాయణమంతావిని రాముడికి సీతేమౌతుందన్నాట్ట నీబోటివాడు. నాపేర్న వుంటే అప్పులబాధ భరించలేమనేగా యీవ్యవహారం చేసేది.

సతీ:- నాపేరునవున్నా హోటల్ మీద పడతారేమో ?

జాన:- లోగడే అయిదారు నెలలక్రితం రిజిష్టర్ చేయించుకున్నట్లు వ్రాయిస్తే సరిపోతుంది.

సతీ:- అయితే యీరోజే వ్రాసి ఫ్రా ర్తి చేసుకుందాం బ్రదర్ !

జాన:- అలాగే! నామోహినిని ఒకసారి రమ్మని చెప్పు.

సతీ;- బ్రదర్ ! మనముంది అందుకేగా !

[లోనికి వెళ్తాడు, జానకిరాం సిగరెట్టు వెలిగించి కాల్చుకుంటూంటాడు. మోహిని గ్లాసుతో బ్రాందీపుచ్చుకుని లోనినుంచి నాట్యంచేస్తూ వస్తుంది.]

( మోహిని పాట )

రావోయీ రావోయీ
రావోయీ అందాలరాజా ॥ రా ॥
ఆనందముతో ఆహ్వానించితి
అర్థాంగిగా అందుకోనవోయీ ॥ రా ॥
మోదముగూర్చెడి ముద్దుమోముతో
ప్రేమను గొలిపెడి ప్రణయరూపుతో
వచ్చితినోయీ నారాజా ॥ రా ॥

తారను నేనేగా చెందురుడి వీవేగా
తారాచెందురుల వెలయుదమూ
పరిణయవీధిలో విహరించెదమోయీ ॥ రా ॥

(పాటయ్యేటప్పటికి వచ్చి జానకిరాం చేతిలో వాల్తుంది)

జాన:- (పేరిమపూర్వకంగా) మోహినీ!

మోహి:- (అర్ధనిమీలిత నేత్రాలతో) రాజా!

జాన:- యింతఆలస్యమైందేం?

మోహి:- మీరెవరితోనన్నా మాట్లాడుతూన్నారేమోనని వుద్దేశ్యంతో రాలేదు.

జాన:- మంచిపనిచేశావ్! ఇంకొంచెం ఆలశ్యమైతే ఏమయ్యేవాణ్ణో! నిన్నుచూడందే ఒక్క క్షణం వుండలేకపోతున్నాను మోహినీ!

మోహి:- ఆఁ అలాగా రాజా!

జాన:- మరేమనుకున్నావ్! మర్చిపోయాను. యీ హోటల్ సతీష్ పేరున మార్చి నడపదల్చుకున్నాను.

మోహి.- నేను కాదంటే మీరూరుకుంటారా?

జాన:- అయితే నీకిష్టంలేదా?

మోహి:- మీయిష్టమే నాయిష్టం! యీబాధలన్నీ మరొకరి మీద పెట్టి నారాజా ఎప్పుడూనాకు ఎదురుగా కూర్చుంటే ఎంతో ఆనందంగా కాలం గడిచిపోతుంది.

జాన:- ఆఁ అలాగా!

మోహి:- మరెలాగనుకున్నారు?

జాన:- నేనేమీా అనుకోలేదు.

(సతీష్ లోనినుంచి వస్తాడు.)

జాన:- సతీష్! యీారోజునుంచీ సప్లయర్సు అందర్నీ కుదుర్చుకుని హోటల్ జాగ్రత్తగా రన్ జేసుకునే బాధ్యత నీమీాద పెడుతున్నాను.

సతీ:- ఓ యస్! అలాగే! మీారే చూస్తారుగా మనప్రతాపం!

(బయటకు వెళ్తాడు)

మోహి:- సరే! యింకా యిక్కడ మనమెందుకూ?

జాన:- ఏంచేద్దాం!

మోహి:- ఏంచేద్దామా......

( మోహిని పాట)

రావోయీా రావోయీా
రావోయీా అందాలరాజా ॥ రా ॥
ఆనందముతో ఆహ్వానించితి
అర్ధాంగిగా అందుకోనవోయీా
రావోయీా రావోయీా
రావోయీా! (అంటూ జానకిరాంచెయ్యి పుచ్చుకుని లోనికి లాక్కువెళ్తుంది.)

(తెర వాలును.)

# పల్లెజీవి

## 5వ రంగము

( తెరలో బుర్రకథ )

వినరా భారత కళాకారా
విజయము మనదేరా తందానా
తందానా దేవనందనాన ॥ వి ॥
తమ్మునికోసం పట్నాలన్నీ
గాలించాడండీ ॥ తం ॥
దేశాలన్నీ గాలించిననూ
జాడేలేదండీ ॥ తం ॥
వీడిపోయినా తమ్మునికోసం
కుమిలిపోయారండీ ॥ తం ॥
మనోవ్యాధికి మందేలేకా
మంచంపట్టాడూ ॥ తం ॥
రోజురోజుకూ వ్యాధీప్రభలీ
క్షీణించాడండీ ॥ తం ॥
అంతిమఘడియలు ఆసన్నమైనా
తమ్ముని అంతేలేదండీ ॥ తం ॥

తమ్మునికోసం తహతహలాడీ
ఎదురుచూస్తున్నాడండీ ॥ తం ॥

అలా పరారైన తమ్మునికోసం గోపయ్య పట్టణాలన్నీ గాలించారు! దేశాలన్నీ వెదికించారు! తుదకు ఆశ నిరాశ చేసుకుని అన్న పానీయాలకు స్వస్తిచెప్పి మనోవ్యాధితో మంచంపట్టాడు. అంతిమ ఘడియ లాసన్నమైనా తమ్ముని రాకకోసం తహతహలాడటమేకాని తిండి తలంపేలేకుండా పోయిందా అమాయకుడికి. భర్త ప్రాణంకోసం, మరది జాడకొరకు, అనేకపూజలూ పునస్కారాలూ అనేక వ్రతాలూ సల్పుతూ ఆ భగవంతుని వరప్రసాదంకోసం ఎంతో నిర్మలంగా ప్రయత్నిస్తోంది ఆ మహా యిల్లాలు. ఇట్లుండగా ఒకరోజున......

[ తెర లేచేసరికి గోపయ్య యిల్లు, అంతా మొదటిసీనుమాదిరే అలంకరించాలి. సీత భగవంతునికి పూజచేస్తూంటుంది. గోపయ్య గడ్డం పెరిగి పిచ్చిరూపుతో మంచంమీద పడుకుని మూలుగుతూంటాడు. ప్రక్క నే కుర్చీమీద మందుసీసా, గ్లాసూ, పళ్లు పెట్టివుంటై.]

( సీత పాట )

జగదీశ్వరా రావా నను కావగా ॥ జ ॥
ప్రాణనాథుని ప్రాణము లోసగగా
భక్తురాలి మొగ ఆలకింపగా
వేగరావా పరమేశా ॥ జ ॥

మనసుతీరా వేడితినిన్నూ
పూజలుచేసీ పిలిచితినిన్నూ
వరమునీయగా వేగరావా
అభయమొసగరావా దేవా ॥జ॥

[ హారతి వెలిగించి భగవంతునికిఅద్ది, తరువాత భర్తకు అద్ది, అంతిమకు తను అద్దుకుని భర్త దగ్గరకు వెళ్లి గ్లాసులో మందుపోసి] యీమందు పుచ్చుకోండి!

గోప:– మరణశయ్యమీద నిద్రిస్తూన్న నాకు యీ మందు ఏంపనిజేస్తుందే?

సీత:– అలా అనకండీ! తాగండీ! నాకోసంతాగండి!

గోప:– నీకోసమే యింతకాలం ఆగింది. లేకపోతే ఏనాడో కళ్ళుమూసేవాణ్ణి!

సీత:– అబ్బ! ఏంమాటలండీ!

గోప:– పిచ్చిదానా! మాటలేమెటి! ప్రతిమానవుడూ జీవితంలో ఎంత జల్సాగా బ్రతికినా, ఎన్నిఆనందాలు అనుభవించినా, యెన్నికష్టాల కోర్చుకున్నా, యీ మృత్యుదేవతకు దాసోహం అనాల్సిందే!

సీత:– ముందీమందు తాగండి.

గోప:– మందుల్తో మాకుల్తోమనోవ్యాధి యెలాగయమాతుందే?

సీత:– అదేనయమాతుంది. తాగండీ! మన జానకిరాం తప్పక తిరిగివస్తాడు.

గోప:- ఆఁ వస్తాడు. కాని వాడువచ్చేటప్పటికి వీడుచస్తాడు.

సీత:- అబ్బ! వూరుకోండీ!

గోప:- యిందులో తప్పేముందే! పేదా సాదా, బీదా బిక్కీ అంటూ యీభూమిమీద వ్యత్యాసాలేగాని, అందులో కలసిపోయిన తరువాత యెవ్వరికీ ఏమీ అడ్డురావు. లక్షాధికారీ చస్తాడు! భిక్షాధికారీ చస్తాడు! యిద్దర్నీ కలిపేది యీమట్టిలోనే! ప్రతిమానవుడూ పుడతాడు, ఛస్తాడు. మళ్లీ పుడతాడు, మళ్లీ చస్తాడు. కాని యీ జీవితాలకు అంతూపొంతూ అంటూ ఏమీవుండదు.

సీత:- యిహ చాల్లెండి. వేదాంతం! ముందు యీమందు పుచ్చుకోండి.

గోప:- మందుపుచ్చుకోండి, మందుపుచ్చుకోండి. ఏంపుచ్చుకో వటమో! మందు పుచ్చుకోకపోతే నాప్రాణం పోతుం దన్న భయంతో ముందు నీప్రాణంపోయేటట్లుంది.

సీత:- అంతకన్నా ఆడదానికి అదృష్టమింకేముంది? తన పసుపుకుంకాన్ని గంగలో కలపనీయక, జీవితాన్నే అందులో కలుపుకున్నంత సుఖముందా స్త్రీ జాతికి. మందు పుచ్చుకోండి. (అంటూ యిస్తుంది.)

గోప:- (అందుకుని (తాగి) అమ్మయ్య! తృప్తితీరిందా? నా ప్రాణం నిల్పుకోలేకపోయినా ముందునీప్రాణం నిల బెట్టాను.

సీత:- వెళ్ళి జావకాసుకవస్తాను. (లోనికి వెళ్తుంది.)

(గోపయ్య మూలుగుతూ బాధపడుతూ అటూ యిటూ కదుల్తాంటాడు. తెరలో పాట వినిపిస్తా ఉంది)

( తెరలో తత్త్వం )

జీవా... ... ... ... ...
ఇంతేనన్నా జీవిత మింతేరన్నా
కష్టనష్టములకోర్చిన మీకూ
కఠినశిక్షయే ఖాయంబన్నా
ఖర్మనుదాటగ ఏరికితరమా
ఆశ నిరాసే ఫలితంబన్నా ॥ ఇం ॥

గోప:- (ఆయాసపడుతూ) అబ్బా! (దగ్గుతాడు) అమ్మా! సీతా! సీతా!

సీత:- (లోపలనుంచి) ఆఁ వస్తున్నా! (వచ్చి) ఏమండీ!

గోప:- కొద్దిగా మంచినీళ్ళివ్వు! అమ్మ!

సీత:- (లోనికివెళ్ళి మంచినీళ్ళు తెచ్చియిస్తుంది.)

గోప:- (లేచి తాగి) అమ్మయ్య! యిప్పటికిమాత్రం ప్రాణం నిలబెట్టావ్!

బయట:- గోపయ్యగారూ!

సీత:- యెవరూ! (అంటూ వెళ్తుంది)

బయట:- వుత్తరం వచ్చిందండీ!

సీత:- యెవరువ్రాశారబ్బా ! (అంటూ కవరువంక చూస్తూం టుంది.)

గోప:- త్వరగాతీసి చదువు. యెవరువ్రాసిందీ తెలుస్తుంది.

సీత- (తలవైపు క్రిందకూర్చుని కవరుచించి చదువుతుంది)

మహా రాజశ్రీ గోపయ్యగారికి మీామిత్రుడు నాగభూషణం ప్రేమపూర్వకంగా తెలియపర్చేదేమంటే మేము క్షేమంగానే యున్నాము. మీారుకూడా క్షేమమేనని తలుస్తాను. నేను ముఖ్యంగా తెలియపర్చేదేమంటే అయిదు సంవత్సరాలక్రితం పారిపోయిన మీాతమ్ముడు ప్రస్తుతం యీాపట్టణములో వున్నాడు. కనుక మీారు తక్షణం బయలుదేరి వచ్చిన అన్ని విషయములూ తెలుస్తై !

శెలవ్ !
మీా మిత్రుడు,
నాగభూషణం.

గోప:- (లేస్తూ) ఆఁ ! నా జానకిరాం వున్నాడా ! యిప్పుడే వెళ్దాం ! యెక్కడున్నాడో తెల్సుకుందాం ! వెంట తీసుకువద్దాం !

సీత:- అలాగే ! తొందరపడతారేం ! అన్నీ సర్దుకుని వెంటనే బయలుదేరి వెళ్లి వెంటతీసుకువద్దాం !

గోప:- (సంతోషంగా) అబ్బ ! యెన్నాళ్ళకు ?

సీత:- అయిదు సంవత్సరాలకు

గోప:- మళ్ళీ నాతమ్ముణ్ణి చూడగల్గుతున్నాను. యెంతమంచి రోజు.

సీత:- నేనిందాకే అనుకున్నాను. హృదయానే భగవంతుని మొహాం చూశాను. అందుకే శుభవార్త నా చెవిని పడింది. (అంటూ వెళ్ళి దేవుడికి దణ్ణంపెడ్తుంది.)

గోప:- యింతకీ నీభక్తి ప్రభావంవల్లే తెల్సిందంటావు.

సీత:- కాదులెండీ... మీ పత్రిక ప్రకటనలతో తెల్సింది.

గోప:- అవునుమరి.

సీత:- యేలాగైతేనేం మన జానకిరాం మనకు లభించాడు. మనకు అదే పదివేలు.

గోప:- త్వరగా వెళ్లి బట్టలపీసర్దు వెళ్దాం.

సీత:- అలాగే! (లోనికి వెళుతుంది. సంతోషంతో అటే చూస్తూ లేస్తూంటాడు. తెరలో "లేవరా లేవరా" పాట వినిపిస్తూంటుంది.)

(తెరపడును.)



# పల్లైజీవి

## 6 వ రంగము

( తెరలో బుర్రకథ )

వినరా భారత కళాకారా
విజయము మనదేరా తందాన
తందానా దేవనందనాన ||
పేరూ వూరూ లేనివాడురా
పదవీకొచ్చాడూ || తం ||
అధికారమంతా అనుకోకుండా
అన్యులకందిందీ || తం ||
అప్పులవాళ్ళూ హోటలుమీదా
విరుచుకుపడ్డారూ || తం ||

ఈవిధంగా జానకిరాం తనహోటల్‌ను సతీష్ పేరున వ్రాసి, మధుపాన మహత్యానికి విపరీతంగా లొంగిపోయి, వేశ్యాలోలుడైనాడు. బాకీలవాళ్ళంతా హోటలుమీద దాడి చేయటానికి నిశ్చయించుకున్నారు. ఇట్లుండగా ఒకరోజున ఏం జరిగిందయ్యా అంటే......

[ తెరతీచేసరికి అంతా రెండవరంగం మాదిరే అలంకరించాలి. సమయం షుమారు సాయంత్రం 7 గంటలు. సతీష్ క్యాష్‌లో కూర్చుంటాడు రేడియోలో నుంచి ఇంగ్లీషుట్యూను వినిపిస్తూంటుంది ]

తె. పా:- బాబుగోరు! మర్యాదగా డబ్బులిచ్చేది లేందీ చెప్పండీ!

తె. మా:- ఆజ్ పైసా దేనా! నైతో మేరా ముస్లింకా తడాఖా దేఖో!

[ సతీష్ కాలింగ్ బెల్లు కొడతాడు. లోనినుంచి సప్లయర్ వస్తాడు. ]

సతీ:- బయట యెవరో కేకలు వేస్తున్నారు. చూడు.

సప్ల:- (బయటవైపుకు వెళ్ళి) ఏయ్! ఏమిటీ గొడవ?

తె. మా:- ఘాండ్వా క్యాజీ! మేరా పైసాదేనా?

తె. పా:- డబ్బులు అడగుతే కలోళ్ళకి గొడవలాగే వుంటుంది లెగండీ!

సప్ల:- ఓహో అదావిషయం! యీహోటల్ అమ్మేసి వాళ్ళవూరు వెళ్ళిపోయాడాయన.

తె మా:- హెప్డూవస్తాగు హాండీ!

సప్ల:- అదేం తెలియదు. యిక్కడేముందని వస్తాడు? అన్ని ఆశలూ ఆశయాలూకూడా తీరిపోయినై అనుకుంటాను. అమాంతంగా ఆరిపోయి పుట్టింటికి టికట్టు కొనుక్కున్నాడు.

తె. మా:- నమ్మకరాం! ఇస్పెడ్కింగ్ ఖైమా ఖైమా సేస్తాం!

తె. పా:- మామంచిగా టోపీపెట్టినాడు లెగండి!

సప్ల:- లేకపోతే చెడ్డగా పెట్టించుకునేదెవరు యీరోజుల్లో?

సతీ:- ఏమిటి బ్రదర్! అహా! ఏమిటది ?

సప్లై:- యింకేముంటుందండీ బాకీలవాళ్ళు.

సతీ:- మనవాడు యిలాంటి చిన్నచిన్న వాటికికూడా టోపీపెట్టా డేమిటి ?

సప్లై:- అదేమిటండీ! నూరు గడ్డిపరకలు కలసి ఒక మదపు టేనుగునైనా భంధించగలవన్నారు. అలాగే యిలాంటి చిన్నచిన్న బాకీలు కలుస్తే ఒక లక్షాధికారినైనా మింగెయ్యగలవ్!

సతీ:- నిజమే బ్రదర్! (నాలిక కొరుక్కుని) మంచిసామెతే చెప్పావోయ్!

(జగదీశ్ శేట్ వచ్చి కుర్చీలో కూర్చుంటాడు)

సప్లై:- (దగ్గరకు వెళ్ళి) ఏంకావాలండీ ?

జగ:- మీ ప్రొప్రయిటర్నిదా పిలువ్!

సతీ:- ఎందుకండీ !

జగ:- యామియా పిలువ్ మని సెప్తాంటే... ...

సప్లై:- అదేమిటండీ! యీాయనేగా మా ప్రొప్రయిటర్!

జగ:- ఆఁ! ఎన్నావిషయం!

సతీ:- అవునండీ యీహోటల్ నేను కొన్నాను.

జగ:- ఎప్పో ?

సప్లై:- అయిదారు నెలలయ్యింది.

జగః- ఎన్నా! మరి జానకిరాం ఎంగే?

సప్లః- అప్పులబాధ భరించలేక ... ...

సతీః- బోర్డుతిప్పి యింటికి వెళ్ళిపోయాడు బ్రదర్!

జగః- అడ్రస్సుదా వున్నదా?

సతీః- లేదు బ్రదర్!

జగః- (కుర్చీమీదనుంచి లేచి) అరె ఎన్నామోసం! ఎన్నా దగా! అందుకుదా నే అంజి ఆరునెలలబట్టిదా వత్త రాలుకూడా రాటంలేదూ! లక్షరూపాయలుదా పోసి కొని వీడిమొఖానదా పెట్టినాను. రొంబ మంచిపనిదా సేసినాడు. వుండండి వీడిపని నేనుదా సెప్తును. నమ్మకమైన పిల్లవాడుదా అని నమ్మితినీ! ఇందా ప్రపంచంలో ఎంగేదావున్నా పట్టించి జైలులోదా పెట్టించకపోతే నాపేరుదా జగదీశ్ శేట్ కానేకాదు. (వెళ్లబోతాడు.)

సతీః- బ్రదర్ కొద్దిగా కాఫీతాగి వెళ్ళండి!

జగః- అనుకున్నపనిదా అయ్యేవరకూ గుక్కెడు మంచినీళ్ళుదా తాగను! (బైటకు వెళ్తాడు)

[సప్లయర్ లోనికివెళ్తాడు. లోపలనుంచి జానకిరాం వస్తాడు]

జానః- వ్యాపారం ఎలావుందయ్యా!

సతీః- వ్యాపారం సంగతెలావున్నా ముందు నీవ్యవహారంచూడు.

జానః- నావ్యవహారానికి వంకేమొచ్చిందిప్పుడు? (కూర్చుంటాడు.)

సతీ:- యిటు అప్పులవాళ్లంతా నిలబెడ్తామంటున్నారు.

జాన:- అసలు కనిపిస్తేగా!

సతీ:- అదేమిటి బ్రదర్ ! యీహోటల్‌కి పెట్టుబడి యెవరో పెట్టారటగా ! ఆయనెవరోవచ్చి నిన్ను పట్టిస్తానని, అరెస్టు చేయిస్తానని, జైల్లో వేయిస్తానని నానామాటలు అని చాలాకోపంతో నిష్క్రమించాడు.

జాన: (గాబరాతో) యెక్కడున్నానని చెప్పారు ?

సతీ:- అతను చేసే హడావుడికి భయపడి... ...

జాన:- యిక్కడేవున్నానని చెప్పావా ?

సతీ:- చెప్పకపోతే వదిలేటట్లు... ...

జాన:- కనబడలేదని చెప్పావా ?

సతీ:- వుండు బ్రదర్ ! గాబరాపడతావే ?

జాన:- (భయంగా) గాబరాయేమిటయ్యా! ఏదోమార్గంచూసుకోపోతే సరాసరి శ్రీకృష్ణజన్మస్థానానికి తీసుకువెళ్తారు.

సతీ:- అవే అనుకుని నాకు తెలీయదూ, అయిదారు నెలల క్రితమే వెళ్లిపోయాడని ఖచ్చితంగా చెప్పాను.

జాన:- మంచిపనిచేశావ్ బ్రదర్ ! యెవరొచ్చి అడిగినా సరే అలాగేచెప్పు !

సతీ;- చెప్పినందుకు బహుమతి ?

జాన:- హోటల్ ప్రొప్రయిటరయినా అలవాట్లుపోలా ?

సతీ:- ఏయెండకాగొడుగు పట్టాలన్నారు పెద్దలు. అయినా అలవాటైయింది అమాంతంగా ఆగాలంటే ఆగిపోతుందా?

జాన: రామేశ్వరం వెళ్లినా శనేశ్వరం తప్పనట్లు పొరిపోయిట రయినా నాకీబాధ తప్పలేదు. సరే! తీసుకో! (అంటూ రెండు పదిరూపాయి కాగితాలు యిచ్చి లోనికివెళ్తాడు)

సతీ:- హోటల్ ఆరినా కుర్రవాడు యింకా ఆకలేదన్నమాట! (డబ్బు జేబులో పెట్టుకుని) బ్రదర్! నూరుఅబద్ధాలు ఆడితేగాని ఒకపెళ్లి అవ్వదట, అలాగే అన్నిఅబద్దాలు ఆడితేగాని ఒకరిజీవితం నిలబెట్టలేమేమో!

[బయటనుంచి గోపయ్య చేతిలోపెట్టి మరోచేతిలోకర్రి పిచ్చి రూపం, వెనకాల సీత వస్తారు.]

గోప:- ఏమండీ! గదులేమైనా ఖాళీవున్నయ్యా?

సతీ:- (బెల్లుకొడతాడు. సప్లయర్ వస్తాడు) రూమ్స్ ఏమన్నా ఖాళీవున్నయ్యేమో చూచిరా!

(సప్లయర్ లోనికివెళ్తాడు.)

సతీ:- ఏవూరు బ్రదర్!

గోప:- మాదొక పల్లెటూరండీ!

సతీ:- పట్టణంచూసి పోదామని వచ్చారా?

గోప:- అబ్బే లేదండీ! మాతమ్ముడు అయిదు సంవత్సరాల క్రితం మారిపోయాడు. ఎన్నిచోట్ల వెతికించినా

ప్రయోజనం లేకపోయింది. యీావూళ్లో వున్నట్లు ఒక స్నేహితుడు వ్రాశాడు. అతని యింటికి యీ అర్ధ రాత్రిలో వెళ్ళి వాళ్ళను యిబ్బంది పెట్టటం యిష్టంలేక యీరాత్రికి యిక్కడవుండి వుదయం వెళ్ళవచ్చునని వచ్చాము.

సప్ల:- (వచ్చి) రెండు సింగిల్ రూమ్స్ ఖాళీవున్నయ్యండీ !

సతీ:- రెండు చిన్నగదులు ఖాళీవున్నయ్యట బ్రదర్ !

గోప:- అయినా ఫరవాలేదండీ! ఎలాగో ఒక్కదాంట్లో నే సర్దుకుంటాములేండి.

సప్ల:- అలా వీలుపడదండీ !

సతీ:- అది రూల్సుకు వ్యతిరేకం బ్రదర్ ! ఒక్కొక్కరూమ్‌లో ఒక్కొక్కరే వుండాలి. ప్రక్కప్రక్కనే వున్నై. భయ పడాల్సిన అవుసరమేమీ వుండదు.

గోప:- సరే అలాగేలెండి !

సతీ:- ఒక పదిరూపాయలు అడ్వాన్సు యిప్పించండి.

(గోపయ్య పదిరూపాయలనోటు యిస్తాడు)

సతీ:- (పుస్తకంలో వ్రాసుకుంటూ) మీాపేరు ?

గోప:- గోపయ్య అండీ !

సతీ:- వూరు ?

గోప:- సూర్యాపురం.

సతీ:- వృత్తి ?

గోప:- వ్యవసాయం.

సతీ:- (సప్లయరుతో) వీరిని తీసుకువెళ్ళి రూమ్స్‌లో ప్రవేశ పెట్టరా !

[గోపయ్యా, సీత, సప్లయరు లోనికి వెళ్తారు. సతీష్ రేడియో దగ్గరగా పెడ్తాడు. హుషారుగా సిగరెట్టు కాలుస్తూంటాడు. జానకిరాం లోనినుంచి వస్తాడు ]

జాన:- ఏమిటీ హుషారుగావున్నావ్ ?

సతీ:- హుషారేమిటి బ్రదర్ ! పారాహుషార్ !

జాన:- విషయమేమిటి ?

సతీ:- చెప్పమంటావా బ్రదర్ !

జాన:- తప్పకుండా.

సతీ:- చెప్తేనాకేం యిస్తావ్ ?

జాన:- వుపయోగముంటే నువ్వేదడిగితే అది యిస్తాను.

సతీ:- (రహస్యంగా) పైన సింగల్ రూమ్‌లోకి యీరోజే ఒక పిట్ట వచ్చింది,

జాన:- (ఆశగా) ఆఁ!

సతీ:- మరేమనుకున్నావ్ ! ఓహో ! ఏమిఅందం ! ఏమి వయ్యారం ! ఏమిసొంపు !

జాన:- నిజమా !

సతీ:- అబద్ధం చెప్పాల్సిన అవసర మేమొచ్చింది ?

జాన్:- (ఆదుర్దాగా) ఎలావుంటుంది ?

సతీ:- ఏంచెప్పమంటావ్ బ్రిదర్ ! ఆ హండ్రెడ్ కాండిల్ పవర్ బల్బు వెల్తురులో చూశానేమో ! ఆ నిగనిగ లాడే నల్లని జుట్టు, చల్లగావీచే పిల్లవాయువుకి రెపరెప లాడే ముంగురులు, విల్లువలె వంగిన కనుబొమ్మలు, నేరేడుపళ్లులాంటి కళ్లు, నవనవలాడే చెక్కిళ్లు, మిల మిలా మెరిసే దానిమ్మగింజలులాంటి పలువరుస, (లేచి నటిస్తూ) వెల్ డెవల్డ్పు బాడీతో యిలా యిలా యిలా, నడుస్తూంటే అలా అలా అలా చూస్తూనే చతికిలబడ్డానంటే నమ్ము.

జాన:- (గుటకలుమింగుతూ) ఆc ! అంతఅందంగా వున్నవాళ్ళు కూడా వున్నారంటావా ?

సతీ:- వున్నారంటావా అనేకంటే వుదాహరణగా చూస్తే చాలు ...... అబ్బ ! వేరేచెప్పాలా ! అలాగే ఐస్ అయిపోవాల్సిందే !

జాన:- అయితే మనం ప్రియత్నిస్తే ?

సతీ:- లాభంలేదు బ్రిదర్ ! పక్క రూమ్‌లో దానిభర్త వున్నాడు. లోగడవ్యవహారాల మాదిరి ముడిబడటం చాలాకష్టం !

జాన:- ఎందుకని ?

సతీ:- ఎందుకనేమిటి బ్రిదర్ ! పల్లెటూరివాడట ! ప్రాణాలను కూడా వెరవక పేగులుతీసిమరీ వెళ్తాడు.

జాన:- మనంమాత్రం కాదా ?

సతీ:- లోగడ. కాని యిప్పుడు కాదుగా ?

జాన:- అయితే యిప్పుడేంచేద్దాం ?

సతీ: చెప్తాను ఆగూ......(ఆలోచించి) నువ్వు సైలెన్సుగా అర్ధరాత్రివేళ గదిలోప్రవేసించి గల్లంతు లేకుండా వ్యవహారం ముగించుకుని జాగ్రత్తగా వచ్చై.

జాన:- ఓ( అలాగే! (వెళ్ళబోతాడు)

సతీ:- ముందు మోహినిని యిక్కడికి పంపించు. లేకపోతే వ్యవహారం అడ్డంతిరుగుతుంది.

జాన:- సరేలే ! (వెళ్ళబోతాడు)

సతీ:- మరి మన బహుమతి ఏది బ్రదర్ !

జాన:- ( జేబులోనుంచి పదిరూపాయల కాగితం తీసియిచ్చి ) సరే! వెళ్లొస్తాను! (లోనికి వెళ్తాడు)

సతీ:- శీఘ్రమే కార్యసాఫల్య సిద్ధిరస్తు! (అంటూ దీవిస్తూ నోటు జేబులో పెట్టుకుని) ఆరిపోయాండు కుర్రాడు! వేరేవాళ్ళను వెతుక్కోవటం మంచిదోయ్ బ్రదర్! వందలిచ్చే చేతిలోనుంచి పదులు, ఇరవైలూ వస్తూంటే ఏం తృప్తివుంటుంది? ఎలాకాలం గడుస్తుంది? నామోహిని ఒక్కపూట సెంటు వ్రాసినంత లేదు. (మోహిని వస్తుంది) నీకు నూరేళ్లాయుస్సు!

మోహి:- ఏమిటి విశేషం ?

సతీ:- వింటే చాలావున్నై.

మోహి:- వినవిపక్షంలో యిక్కడ వుండేదాన్నే కాదుగా! కాదని యెప్పుడన్నాను?

సతీ:- అయితే విను! (రహస్యంగా) యిక్కడి వ్యవహారం చల్లబడింది.

మోహి:- అయితే వెళ్ళిపోదామా?

సతీ:- వెళ్ళిపోతే జీవించేమార్గం?

మోహి:- మన బిజినెస్‌కి ఏస్థలమైనా ఒకటే నేమో?

సతీ:- ఎట్లా! పల్లెటూళ్ళకూ పట్టణాలకూ తేడాలేదూ?

మోహి:- అయితే ఏంచేద్దాం?

సతీ:- ఇక్కడేవుంటూ యీ రూమ్స్‌కి వచ్చిన వాళ్ళను మచ్చిక చేసుకుని వల్లో వేసుకోవటమే!

మోహి:- జానకింరాగారేమైనా అంటారేమో?

సతీ:- అదేమిటే! ఎందుకంటాడు? తనేమన్నా తాళికట్టిన భర్తా? అలాంటివాళ్ళకే దిక్కూ-మొక్కూ లేదు యీ రోజుల్లో!

మోహి:- సరే మీ యిష్టం! నీళ్ళముంచినా పాలముంచినా భారం మీదేనని లోగడే మనవి చేసుకున్నానుగా స్వామీ!

సతీ:- అని నాకు తెల్సుగా రాణీ!

మోహి:- యింతకీ విషయం ......

సతీ:- చెప్తాను. యీరోజే ఒకడు వచ్చాడు. పల్లెటూరి వ్యక్తి లాగున్నాడు. కాస్తోకూస్తో డబ్బుగలవాడిలాగా వుంది వాలకం. వాణ్ణి వల్లో వేసుకుంటే నాలుగు డబ్బులు రాలేటట్లున్నై.

మోహి:- ఎక్కడున్నాడు ?

సతీ:- పంపిస్తాను ఆగు. వాళ్ళు నమ్మితే ప్రాణమిస్తారు! లేకపోతే ప్రాణం తీస్తారు! జాగ్రత్తసుమా?

మోహి:- అలాగే! మీరే చూస్తారుగా!

సతీ:- సరే వెళ్దాంపద! (లోనికి వెళ్తారు. సప్లయిర్ వచ్చి కౌంటర్ దగ్గర నిలబడతాడు)

( తెరపడుతుంది. )



# పల్లెజీవి

## 7వ రంగము

విసరా భారత కళాకారా
విజయము మనదేరా తందాన ॥
తందానా దేవనందనాన ॥
సూర్యాపురపూ గోపయ్యగారూ
నిద్రలోవున్నాడూ ॥ తం ॥
రేయింబవలూ కష్టించేటీ
రైతుబిడ్డడండీ ॥ తం ॥
అలసీ సొలసీ నిద్రతోకలసీ
నిద్రించాడండీ ॥ తం ॥
అర్ధరాత్రిలో వేశ్యాజీవీ
గదిలో జేరిందీ ॥ తం ॥

బస్తీ మోసాలెన్నడూ చవిచూడని పల్లెరైతు, ప్రయాణ బడలికతో, అలసి సొలసి వుండుటచేత, నిర్విచారంగా నిద్రా దేవి వడిలో వరిగిపోయాడు. అదేసమయంలో ధనానికాసించిన వేశ్యాజీవి నిశ్శబ్దంగా గదిలో ప్రవేసించి, అతనివాలకం పరికించి నిద్రాదేవిని అతనినుండి వేరుచెయ్యటానికి ఏమిచేసిందయా— అంటే......

[తెర లేచేసరికి "రూం నెంబరు 3" అని బోర్డుతగిలించివుంటుంది. ఒకమంచంమీద దుప్పటి పరిచి దానిమీద గోపయ్య నిద్రిస్తూంటాడు. ఒక ప్రక్కన చిన్న టేబుల్, దానిమీద కూజా, గ్లాసు, ఒకకుర్చీ అలంకరించి వుంటై. మోహిని సుందరమైనదుస్తులు ధరించి తనగానంతో గోపయ్యను లేపటానికి ప్రయత్నిస్తూ నాట్యం చేస్తూంటుంది.]

[మోహిని పాట]

నాహృదిని న్నే వలచెను రాజా
నామదిని న్నే పిలచెను రాజా
వలచెనురా
ఓరాజా పిలచెనురా వలచెనురా ॥ నా ॥
మాయనిమమతల మోదమొందగను
హాయిని తేలితిరా ఓరాజా
హాయినితేలితిరా ॥ నా ॥
వెలసిందేదో వగచిందేదో
వరియించిందేదో ॥ వ ॥
మోదముగూర్చెడి ముద్దులొలుకుచూ
జాలిని గొలుపుమురా ఓరాజా
జాలినిగొలుపుమురా ॥ నా ॥
పున్నమిచంద్రుని ఆకాశంలో చక్కనితారనురా
వలపుబాటలో జగతినడుపగా
పయనింపగరావోయ్ ఓరాజా
పయనింపగరావోయ్ ॥ నా ॥

[పాట మధ్యలో గోపయ్యలేచి యీ దృశ్యమేమిటో అర్థంగాక
తెల్లమొహంతో చూస్తూ కూర్చుంటాడు]

గోప:- (పాట చివరలో సీరియస్‌గా) ఆపు !

మోహి:- (సడెన్‌గా ఆపి) ఏం ?

గోప:- ఎవ్వరునువ్వు ?

మోహి:-(వాలుచూపుగా చూస్తూ) ఏం? ఎలాకనిపిస్తున్నాను?

గోప:- (భయంభయంగా దూరంగా వెళ్తూ) భూతంలాగా !

మోహి:- (చిరునవ్వు) అదిమాత్రం కాను లేండి

గోప:- కాకపోతే అర్థరాత్రి సమయంలో యిక్కడకు రావాల్సిన
పనేమిటి ?

మోహి:- లేకపోతే ఎందుకు రావాల్సి వస్తుంది ?

గోప:- (విసుగుతో) ఏమిటాపనీ ?

మోహి:- ఎందుకలా పాములాగా కస్సుబుస్సుమంటారు ?

గోప:- పిల్లిలాగావచ్చి నక్కితే ఏంజేస్తారు ?

మోహి:- ఎలుకలకోసం అవతారం చాలా అవుసరంకదూ ?
(దగ్గరగావచ్చి) కూర్చోండి !

గోప:- ఏమిటీ ! మహాపరిచయురాలిలాగా మీద మీదకు
వస్తావేమిటి ?

మోహి:- పరిచయం వున్నా లేకపోయినా పరిచయం చేసు
కోవలసిన బాధ్యత నామీదుందిగా !

గోప:- అంటే ?

మోహి:- ముందు కూర్చోండీ ! (అంటూ భుజాలు పట్టుకుని కూర్చో బెడ్తుంది)

గోప:- (భుజం విదిలించుకుని చటుక్కునలేచి) ఏమిటీ స్వాతంత్ర్యం ?

మోహి:- (ప్రేమగా) ఒక్క మాట !

గోప:- ఏమిటామాట ? దూరంగావుండి చెప్తే వినిపిస్తుందిలే చెప్పు.

మోహి:- నా కోర్కె నెరవేరుస్తారా ?

గోప:- (అయోమయంగా) నీకోర్కె నేను నెరవేర్చాలా ! మతి సరిగా లేదనుకుంటా ! నేనేం భగవంతుణ్ణి కానుగా ! నీకోర్కె నాకోర్కె మనందరికోర్కెలు నెరవేర్చడానికి పైన ఆభగవంతుడున్నాడు. ఆయనను ప్రార్థించు.

మోహి:- కాని యీకోర్కె తీర్చడానికి ఆయనే అవసరం లేదు.

గోప:- మానవమాత్రుణ్ణి ! నాలో అలాంటిశక్తి సామర్థ్యాలేమీ లేవు.

మోహి:- అలాంటి వేమీం లేకుండానే మీరు తీర్చగలరు.

గోప:- ఏమిటీ మొండిపట్టు ! అసలువిషయ మేమిటీ ?

మోహి:- (కళ్ళలోకిచూస్తూ) చెప్పమంటారా ?

గోప:- చెప్పు !

మోహి:- (అర్థనిమీలిత నేత్రాలతో కొంటెచూపులుచూస్తూ) నేను..... మిమ్మల్ని......

గోప:- (ఆశ్చర్యంగా) ఆఁ ... నువ్వు... నన్ను... ...

మోహి:- ప్రేమిస్తున్నాను.

గోప:- (గుటకలుమింగుతూ) ఆఁ... ...ఏమన్నావ్ ?

మోహి:- మిమ్మల్నను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నానన్నాను.

గోప:- (భయంగా ప్రక్క-ప్రక్కకు జరుగుతూ) ఏమిటీ !

మోహి:- ఎందుకలా భయపడుతారు ?

గోప:- అర్ధరాత్రిలో పరాయిస్త్రీ వొంటరిగావచ్చి మాట్లాడుతూవుంటే... ...

మోహి:- భయమేస్తోందా ?

గోప:- ఎవరైనా చూస్తే ఏమనుకుంటారు ?

మోహి:- ఏమీఫరవాలేదు. నాకిది ప్రతిరోజూ అలవాటే !

గోప:- అంటే ?

మోహి:- ప్రతిరోజూ యీగదులలోకి అద్దెకు వచ్చినవారికి ఆనందాన్ని కలుగజేసి నేను ఆనందించటమే నాకర్తవ్యం.

గోప:- నీకు యీహోటల్ వారు జీతమిచ్చి కేవలం యిందుకోసం వుపయోగించుకుంటున్నారా ?

మోహి:- ముందు అందరూ అలాగే భ్రమిస్తారు, కాని వారికేమీ సంబంధంలేదు.

గోప:- నీకేమిటీవుపయోగం ?

మోహి:- వారి అనురాగాన్ని పొందిన తరువాత వారిద్వారా ప్రతిఫలాన్ని అపేక్షిస్తాను.

గోప:- అదా విషయం! అంటే నువ్వు వేశ్యవన్నమాట ?

మోహి:- అనే అందరూ చెప్పుకుంటారు.

గోప:- నీదేంకులం ?

మోహి:- నీతీ జాతీ త్యజించి యీవృత్తిలో దిగేవారికు కుల మేమిటీ, గోత్రమేమిటీ!

గోప:- అయితే నీకు భర్త లేడా ?

మోహి:- పెళ్లి కాలేదు. కాని ఒకవ్యక్తి చేరదీసి తీసుకువచ్చాడు.

గోప:- ఒహో అదావిషయం! సరే దయివుంచి యిహా దయచెయ్యి.

మోహి:- యీదీనురాలికోర్కె నెరవేర్చరా ?

గోప:- ఏంకావాలో కోరుకో!

మోహి:- మీరుకావాలి.

గోప:- (కోపంగా) ఏమిటీ!

మోహి:- అవును. మిమ్మలను మనసారా ప్రేమిస్తున్నాను. నాయీకోర్కె నెరవేర్చకపోతే యీనాటితో నాజీవితం ఆఖరు.

గోప:- డబ్బుకాసించి వలచి వలపించుకునే వనితలకు విరహమేమిటీ, ప్రేమేమిటీ! నీకేమన్నా మతిపోయిందా?

మోహి:- హుం! మతిఅంటూ ఒకటుంటేగా పోవటానికి! (కాళ్ళుపుచ్చుకుని బ్రతిమాలుతూ) ఏమండీ! నా కోర్కె నెరవేర్చి నన్ను ధన్యరాల్ని చెయ్యండీ!

గోప:- (విదలించుకుని దూరంగావెళ్ళి) నీభర్త చూస్తే?

మోహి:- ఫరవాలేదు. ఏమీఅనరు.

గోప:- అంటే!

మోహి:- తనేకోరి యిక్కడికి పంపారు.

గోప:- అంటే అతనికీ ఇష్టమేనన్నమాట!

మోహి:- అవును యిష్టమే! (బాధగా) నన్ను మనసారా ప్రేమించానని, నేనులేనిదే బ్రతకలేనని నమ్మించి తీసుకువచ్చారు. సినిమా ప్రపంచంలో పెద్ద తారగా చేయిస్తానని ఆశచూపి తీసుకువెళ్ళారు! ఆడది ప్రాణం కంటే ఎక్కువగా కాపాడుకోవాల్సింది శీలాన్ని. అలాంటి నాశీలాన్ని కాముంకళ్ళకు పొరలుగా కప్పిన కొందరు దుర్మార్గులు నాభర్త అంగీకారంమీదే చెరిచారు. ఆనాటినుంచీ నాకు సినిమా ప్రపంచమంటేనే విరక్తిపుట్టింది. అయినా నమ్మించి తీసుకువచ్చారని వారు చెప్పిన ప్రకారం నాశరీరాన్ని అన్యులకు అద్దెకుయిచ్చి వచ్చినడబ్బుతో కాలం గడుపుతున్నాము.

గోప:- ఛీ! ఛీ! యింతకన్నా నీచం యింకేమన్నా వుందా? కడుపుకోసం ఆడదాని శరీరాన్ని తాకట్టుపెట్టి క్షుద్బాధ

తీర్చుకుంటున్నావా! ఎంతనీచం? యిది నీకూ యిష్టమయ్యే ప్రవర్తిస్తున్నావా?

మోహి:- (వాడిన నవ్వు) యిష్టం! నాయిష్టా అయిష్టాలతో వారికి పనేవుంటే నేను శీలవతిగానే వుండేదాన్ని.

గోప:- నీకు యిష్టంలేకపోయినా అతని సుఖంకోసం నువ్విలా తయారయ్యావన్నమాట!

మోహి:- నమ్మించి తీసుకువచ్చిన వానిమాట కాదంటే ఎలాంటి అపాయానికి గురికావాల్సొస్తుందోనని భయపడి యీ వృత్తికి అంగీకరించాను. (చెయ్యిపుచ్చుకుని) రండీ! నా ప్రేమ నారగించండీ!

గోప: నేను నిన్ను తప్పక ప్రేమిస్తాను సోదరీ!

మోహి:- ఆఁ! సోదరీ!

గోప:- అవును నువ్వు నా సోదరివి! నీతల్లిదండ్రులు ఎక్కడు న్నారో చెప్పు తీసుకువెళ్తాను.

మోహి:- (భయంగా కన్నీటితో) వద్దు! అర్ధరాత్రిలో ఎవ్వరూ చూడకుండా కామునకర్తకి కళ్ళుమూసుకు పోయి పారిపోయివచ్చి యింతవరకూ ప్రవర్తించాను. ఇంక ఏమొహంపెట్టుకొని వాళ్ళదగ్గరకు వెళ్తాను. వద్దు! నేనురాను!

గోప:- సరే! ఇదిగో! (జేబులోనించి నోట్లు తీసి ఆమెకాళ్ళ దగ్గర పడేసి) తీసుకువెళ్ళు! నీభర్తకు యిచ్చి సుఖపడమను! చచ్చేవరకూ తినమను! నీతినియమాలు లేని

యీజీవితం గడిపేకంటే చస్తేనయం! కాని నువ్వు అంధకారంలోపడి కుమిలిపోతూ తెలియక చేస్తున్నావ్! ఇకనుంచైనా నీతిగా సంచరించటానికి ప్రయత్నించు! వెళ్ళు!

మోహి:- (కన్నీటితో) అన్నయ్యా! అంధకారంలో కుమిలిపోతున్న నాకు వెలుగు చూపారు, యీడబ్బుతో నా భర్త ఏంసుఖిస్తాడు? యిదయ్యేంతరువాత నేనెలా తెచ్చివ్వను? మీడబ్బు అక్కర్లేదు! నాకేమీ అవసరంలేదు! మాతల్లిదండ్రులదగ్గరకు వెళ్తాను! చేసిన తప్పుకు క్షమార్పణ కోరుకుంటాను. కాళ్ళావేళ్ళాపడి బ్రతిమాలుకునయినాసరే యథాస్థానం సంపాయించుకుంటాను. యిహానుంచైనా కేవలం నీతి నియమాల కోసం, నిజాయితీగా నిర్మలంగా బ్రతకటానికి ప్రయత్నిస్తాను. అన్నయ్యా! చేసిన తప్పులు తెల్సుకోవటం చాలాకష్టం! అలాంటి నాకు ఆదర్శ జ్యోతిలాగా నిల్చి మార్గం చూపినందుకు నా హృదయ పూర్వకాభివందనము లర్పిస్తున్నాను. శెలవ్! (అంటూ నమస్కారం పెట్టి వెళ్లిపోతుంది. గోపయ్య అటే ఆనందంగా చూస్తూంటాడు.)

( తెరపడును )



# పత్రైజీవి

## 8వ రంగము

[ తెర తీసేసరికి అంతా 7వ రంగము మాదిరే అలంకరించి వుంటుంది. "రూం నెంబరు 4" అని బోర్డు తగిలించి వుంటుంది. టేబుల్ క్రింద పెట్టి వుంటుంది. సీత నిద్రిస్తూవుంటుంది. జానకిరాం నిషాతో ప్రవేశించి సిగరెట్టు కాల్చుకుంటూ ఆవెలుగులో సీతనుచూచి కాలుమీదతట్టి లేపుతాడు. బయట వురుములు మెరుపులతో పెద్ద గాలీవాన ప్రారంభమౌతుంది) ]

సీత:- (గాబరాగా లేచి) ఎ...ఎ...ఎవరు ?

జాన:- భయంలేదు. నేనే !

సీత:- నేనే అంటే !

జాన:- నేనంటే నేనే !

సీత:- ముందు బయటకు దయచెయ్యండి! వొంటరిగావున్న ఆడవాళ్ల గదులలోకి రావటం మీకు ధర్మమేనా ?

జాన:- ధర్మాధర్మాలతో యిప్పుడేంపనిలేదు. ముందు నా కోర్కె నెరవేర్చావంటే వెంటనే నువ్వు చెప్పినట్లే దయచేస్తాను. రా! రా! (అంటూ చేతులుపుచ్చుకుని లాగుతాడు)

సీత:- (చెయ్యి విదలించుకుని) ఛీ! దుర్మార్గుడా ! నాచెయ్యి విడిచిపెట్టు. గదులు ఖాళీలేవని భార్యాభర్తలను వేరు

చేసి వొంటరిగావున్న ఆడవాళ్లను మీా యిష్టాను సారంగా వుపయోగించుకోడానికా యీకపటనాటక మంతాను ? ఆడవాళ్లంటే కీ తిప్పితే తిరిగేకీలుబొమ్మలు గాదు ! పరువు, మర్యాద, నీతి, జాతీ లేని నిర్జీవాన్ని కాదు మీాయిష్టమొచ్చినట్లు వినియోగపడటానికి. మీాలాంటి దుర్మార్గాలు చేసే దుష్టాగ్రేస్వరులకు పవిత్రమైన భారతస్త్రీ కూడా మీావశంకాదు. కాని మీా రొక్కటిమాత్రం గుర్తుంచుకోండి ! రేపు మీాచెల్లెలే యీస్థితిలోవుంటే ! ఎవరైనా మీాభార్యను బలవంత పెడ్తూంటే !

జాన:- నోగ్సేయ్ ! (అంటూ మీాదికి వెళ్తూంటాడు)

సీత:- ( బిగ్గరగా ) దొంగ ! దొంగ ! దొం... ...

జాన:- (కత్తిచూసి) అరచావా జాగ్రత్త !

సీత:- (గుటకలు మింగుతూ) కొంచెం మంచినీళ్ళుతాగనివ్వండి

జాన:- సరే తాగు.

[సీత కూజాలోనీళ్లు గ్లాసులో పోసుకుని తాగుతూ ఆనీళ్లు జానకిరాం మొహంమీాద కొట్టి "దొంగా దొంగా" అని బిగ్గరగా అరుస్తుంది. గోపయ్య గాబరాగా పరిగెత్తివచ్చి జానకిరాంమీాద కలబడుతాడు కొద్ది క్షణాలు ఇద్దరూ కలబడుతారు. ఆఖరికి జానకిరాం గోపయ్యమీాదపడి పొడవబోతాడు ఆ చేతిని గట్టిగా తిప్పి క్రిందబడేసిగోపయ్య జానకిరాంని పొడుస్తాడు. లేచి పక్క స్విచ్ నొక్కి దీపం వెలిగిస్తాడు

జాన:- (కొద్దిక్షణాలు పరికించి) ఆఁ వొదినా ! అన్నయ్యా !

గోప:- ఆ॰ జానకిరాం!

సీత:- నా జానకిరామా!

(గోపయ్య జానకిరాం తలని వొళ్ళో పెట్టుకు కూర్చుంటాడు ప్రక్కనే సీత ఏడుస్తూంటుంది.)

జాన:- (గాయంతో బాధపడుతూ) ఒదినా! క్షమించు. కన్న తల్లిలాంటి నిన్నే బలాత్కరించబోయాను. అన్నయ్యా! నీ తమ్ముడుకీ నీకూ లోగడే రుణం తీరింది. యిప్పుడు శాశ్వతంగా తీరిపోయింది. మీ యిరువురూ నే చేసిన తప్పులు క్షమించండి. (అంటూ నమస్కారం పెడ్తూండ గా బయటనుంచి సతీష్, జగదీశ్ శేట్, సబ్ యిన్స పెక్టర్ వస్తారు.)

సబ్:- ఆ॰! హాత్య! ఎవరూ చంపింది?

గోప:- (లేచి) నేనే చంపాను.

సబ్:- అరే ఘోర సిక్కు! యితని చేతికి బేడీలు వెయ్యి.

సీత:- (ఏడుస్తూ) నన్నుకూడా తీసుకువెళ్ళండి.

(సతీష్ తనమీదకు ఏమన్నా వస్తుందేమోనని భయం భయంగా చూస్తూంటాడు.)

జాన:- (బాధగా) ఆగండి! యీహత్యకు ఎవ్వరూ కారకులుకాదు. ఆపదలో వున్న ఆడదాన్ని రక్షించటానికి వచ్చాడు. ఆయన, కాని నాకు నేనే ఆత్మహత్య చేసుకున్నాను.

గోప:- ఆ॰ జానకిరాం!

జానః- అందరికీ నా తుదివందనాలివే!

(అంటూ నమస్కరించి ఆ స్వేచ్ఛాజీవి కన్నుమూస్తాడు. గోపయ్య, సీత మీదబడి ఏడుస్తుంటారు అందరూ విచారంగాచూస్తుంటారు తెరలో బుర్రకథ వినిపిస్తూంటుంది. తెరపడుతుంది.)

(తెరలో బుర్రకథ)

తందానా తందాన
ఓయ్ దేవనందనాన ॥
పల్లెనివాసీ పట్టణమేగీ
పతనమయ్యాడండీ ॥తం॥
మధుపానానికి స్వేచ్ఛాజీవి
మరణించాడండీ ॥తం॥
వేశ్యాజీవి వలలో చిక్కి
ఆహుతైనాడండీ ॥తం॥
తల్లిలాంటి స్త్రీనే బలా
త్కరించాడండీ ॥ తం ॥
పెంచినవానీ చేతిలోనే
మరణించాడండీ ॥ తం ॥
మనకథ సమాప్తమయ్యిందీ
పోయివస్తామండీ ॥ తం ॥

సమాప్తి.

శెలవు.

మీ

బి. యస్. సూరి.